రెండవ ప్రపంచ యుద్ధానంతరం

# పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభపు తీవ్రత


రచన:

ఐ. కుజ్మినోవ్

అనువాదం:

పరుచూరి కోటేశ్వరరావు



ప్రచురణ:

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

# పరిచయం



‘లాభాలకొరకు ఉత్పత్తి’ అను సూత్రం, పెట్టుబడిదారీ వ్యవస్థ విధానానికి ప్రాతిపదిక. బండికి గడవక, కూలిపనికి చేరే కార్మికులు, తమ శ్రమశక్తితో ఉత్పత్తిచేసే అదనపు విలువ, పెట్టుబడిదారుల లాభాలకు మూలం. కార్మికులకు ఎంత తక్కువ వేతనాలు ఇచ్చి, ఎన్ని ఎక్కువ గంటలు పనిచేయిస్తే పెట్టుబడిదారులకు అంత లాభం వస్తుంది.

ఇలా తయారైన సరుకులు విడుదల ఐతేనే గదా పెట్టుబడిదారులకు డబ్బు చేతికి వచ్చేది! ఈ సరుకులను కొనవలసింది నూటికి 90 మందిగా ఉన్న కార్మికులు, పేద మధ్య తరగతి వర్గం, పట్టణ మధ్యతరగతి ప్రజలు. రైతులు ఉత్పత్తిచేసే ముడిసరుకులను తక్కువధరలకు కొని, కూలీలకు, ఉద్యోగులకు వీలైనంత తక్కువ వేతనాలిచ్చి, పెట్టుబడిదారీవర్గం ప్రజాసామాన్యంయొక్క కొనుగోలుశక్తిని తగ్గించివేస్తున్నది. కొనుగోలుశక్తి పడిపోయిన ప్రజానీకం సరుకులను కొనలేదు. దాంతో సరుకులు మూలపడి, ‘సంక్షోభాలు’ ఏర్పడుతున్నాయి.

పెట్టుబడిదారీ విధానంలో అంతర్గతంగా ఉన్న యీ వైరుధ్యమే సంక్షోభాలన్నిటికీ మూలం. సంక్షోభాలను అధ్యయనం చేయటం, మార్క్సిస్టు అర్థశాస్త్రంలో అతి ముఖ్యమైన సమస్య. పెట్టుబడిదారీ విధానంలో రోజు రోజుకూ ఆర్థికంగా దిగజారిపోతున్న ప్రజానీకానికందరికీ, సంక్షోభాలను అధ్యయనం చేయడం, దాని పరిష్కారమార్గాలను కనుక్కోవడం, ప్రత్యక్ష జీవన్మరణ సమస్య.

పెట్టుబడిదారీవిధానం సామ్రాజ్యవాదంగా మారటంలో, అంతరంగిక వైరుధ్యాల బాహుళ్యము, తీవ్రత రెండూ పెరిగాయి. రెండు సామ్రాజ్య యుద్ధాలు జరిగి, ప్రపంచంలో సగభాగం పెట్టుబడిదారీ వలయంనుండి ఛేదించుకొని, సంక్షోభాల ప్రమేయమేలేని సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలోకి పోవటంతో సంకుచితమైన పెట్టుబడిదారీ ప్రపంచంలోని ఆర్థిక వైరుధ్యాలు మరింత దారుణంగాను, పేద ప్రజానీకానికి ప్రాణాంతకంగాను తయారౌతున్నాయి.

అమెరికా విషయమే చూదాం. యుద్ధకాలంలో బడాపెట్టుబడిదారుల నుండి ప్రభుత్వం చేసిన యుద్ధఋణాలను తీర్చే పేరుతో, అమెరికా ప్రభుత్వం

పేద ప్రజానీకంపై పన్నులభారాన్ని విపరీతంగా పెంచింది. 1945 వ సంవత్సరంతో పోల్చిచూస్తే, 1953 నాటికి అమెరికా ప్రభుత్వానికి పన్నుల రూపంలో వచ్చే ఆదాయం నూటికి 5 వంతులు పెరిగింది. కార్మికులు, ఆఫీసు గుమాస్తాలు తమ ఆదాయంలో మూడవవంతు పన్నులరూపంలో ప్రభుత్వానికి చెల్లించవలసి వస్తున్నది. కార్మికుల జీవనవ్యయం 1939 లో 100 అనుకుంటే, 1952 కల్లా 295.5 పాయింట్లు అయింది. అంటే దాదాపు మూడు రెట్లు అయిందన్నమాట. వేతనాలు అలాగే ఉండి, జీవనవ్యయం పెరిగిపోవటమంటే, వాస్తవిక వేతనాలు పడిపోయినాయని తేలికగా గ్రహించగలం.

సంక్షోభతీవ్రతను తట్టుకోటానికి, నిరుద్యోగ సమస్యను అదుపులో ఉంచటానికి అమెరికా విపరీతమైన సైనిక ఖర్చులు పెడుతోంది. శాంతి కాలంలో సైతం యుద్ధ ఆర్థికవిధానాన్ని అవలంబిస్తున్నది. 1952-53 సంవత్సరంలో అమెరికా తన మొత్తం జాతీయాదాయంలో 60 వంతులు సైనిక శాఖకు కేటాయించింది. ఈ మొత్తం 4446 కోట్ల 60 లక్షల డాలర్లు. ఇంతచేసినా యీనాటికి అమెరికాలో నిరుద్యోగుల సంఖ్య 45 లక్షలకు తక్కువకాకుండా ఉంది.

రెండవ ప్రపంచయుద్ధంలో ఏమాత్రమూ నష్టపడని అమెరికా పరిస్థితే ఈవిధంగా ఉంటే, యుద్ధంలో ఓడిపోయిన జపాను, ఇటలీ, జర్మనీదేశాలు, బాగా నష్టపడ్డ బ్రిటన్, ఫ్రాంసుదేశాల పరిస్థితులు ఎలా ఉన్నవో వేరే చెప్పనక్కరలేదు. ఈ సామ్రాజ్యవాదదేశాల పెత్తనంక్రింద వందల సంవత్సరాలుగా నలిగిపోతున్న, వలస, అర్థవలస దేశాల పరిస్థితులు, వలసవిధానం నుండి బైటపడి స్వతంత్రమార్గాన పురోగమించటానికై యత్నిస్తున్న ఇండియా, బర్మా, ఇండొనేషియాలలో పరిస్థితులు మరింత దారుణంగా ఉన్నాయి.

నేటి పెట్టుబడిదారీ ప్రపంచ సంక్షోభంయొక్క స్వభావాన్ని వివరంగా తెలుసుకోటానికి యీ పుస్తకం ఎంతైనా ఉపయోగపడగలదు. పాఠకులు అమూల్యమైన యీ చిన్ని పుస్తకాన్ని విరివిగా ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

—ఏటుకూరు బలరామమూర్తి.



మొత్తం పెట్టుబడిదారీ ప్రపంచ ఆర్థిక వ్యవస్థను సర్వతోముఖంగా అలముకొనే సంక్షోభాన్నే మనం పెట్టుబడిదారీ విధానానికి చెందిన జనరల్ సంక్షోభం అని పిలుస్తాం. అలాంటి సంక్షోభపు ప్రభావం పెట్టుబడిదారీ ఆర్థిక స్థితిగతులపై మాత్రమే కాక, పెట్టుబడిదారీ దేశాలు అనుసరించే కార్య విధానాలపై కూడా వుంటుంది. పెట్టుబడిదారీ విధానానికి చెందిన జనరల్ సంక్షోభానికి సంబంధించిన మూలసిద్ధాంత సూత్రాలను లెనిన్ విశదీకరించాడు. లెనిన్ విశదీకరణలను ఆధారం చేసుకొని, అంతర్జాతీయ జీవితంలో ప్రత్యక్షమైన నూతన విషయాలకు అనుగుణంగా, స్టాలిన్ ఆ సిద్ధాంతాన్ని అభివృద్ధి చేశాడు.

జనరల్ సంక్షోభం అనేది ఏదో అర్థంతరంగా వచ్చి, అర్థంతరంగా పోయేదికాదు; సుదీర్ఘమైన ఒక చారిత్రక దశ యంతటా ఆ సంక్షోభం ఒక పరిణామక్రమంలో అభివృద్ధి చెందుతూ వుంటుంది. పెట్టుబడిదారీ విధానంయొక్క ఆర్థిక, రాజకీయ అసమమైన అభివృద్ధిసూత్రం కారణంగా, వివిధ దేశాలలో సామ్యవాద విప్లవం ఆయా సమయాలలో పరిపక్వం చెందుతూ వుంటుంది; ఆయా దేశాలు క్రమేణా ఒక్కొక్కటే సామ్రాజ్యవాదవ్యవస్థను చీల్చుకొని, దానినుంచి బయటపడుతుంటాయి. అందువల్ల మొత్తం ఒక చారిత్రక దశయంతటా — ప్రపంచ

యుద్ధాలు, విప్లవాలు, తీవ్రమైన వర్గపోరాటాలు, జాతీయ విమోచనోద్యమాలు, "ప్రపంచవ్యాపితంగా పెట్టుబడిదారీ విధానం పతనం చెంది, సామ్యవాద సమాజావతరణ" ఆదిగా గల సంఘటనలు జరిగే చారిత్రక దశయంతటా —— పెట్టుబడి దారీ విధానానికి సంబంధించిన జనరల్ సంక్షోభం విస్తరిల్లి వుంటుంది.

పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక, రాజకీయాభివృద్ధులలో గల ఎగుడు దిగుడులనుబట్టి, పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభ స్వరూప, స్వభావాలూ, స్థాయీ నిర్ధరించబడు తూంటాయి. పెట్టుబడిదారీదేశాలయొక్క అసమమైనభివృద్ధి ఫలితంగా పెట్టుబడిదారీదేశాలమధ్య గల బలాబలాలలో వచ్చే మార్పులకూ, అప్పటివరకు అమలునందున్న మార్కెట్ల పంపకం, 'ఆర్థిక ప్రాబల్యం, వలస ప్రాంతాలపై ఆధిపత్యం ఇత్యాదులకూ పొత్తుకుదరిని పరిస్థితి, కాలక్రమేణా ఏర్పడు తుంది. ఈ ప్రాతిపదికపైననే సామ్రాజ్యవాదదేశాలమధ్య ఏర్పడే వైరుధ్యాలు పై కారణంవల్ల తీవ్రతరం అవుతాయి. అలా తీవ్రతరమైన వైరుధ్యాలు సంఘర్షణల రూపం తీసు కొని చివరకు ప్రపంచయుద్ధాలుగా పరిణమిస్తాయి. ఆ ప్రపంచ యుద్ధాలు తిరిగి పెట్టుబడిదారీ వైరుధ్యాలు తీవ్రతరం కావ టానికి కారణభూత మవుతాయి; సామ్రాజ్యవాద వ్యవస్థను దుర్బలపరుస్తాయి; సామ్రాజ్యవాద ఇనపసంకెళ్ళలోని బలహీన మైన లింకులు ఒకదాని తర్వాత మరొకటి తునాతునకలై పోవటానికి ఆ యుద్ధాలు దోహదమిస్తాయి. మొదటి ప్రపంచ యుద్ధం (1914 – 1918) వల్ల సామ్రాజ్యవాద వ్యవస్థ బలహీన

పడినందువల్లనే పెట్టుబడిదారీ వ్యవస్థను చీల్చుకొని, దాని నుంచి రష్యా బయటపడటానికి వీలుచిక్కింది. పెట్టుబడిదారీ విధానానికి సంబంధించిన జనరల్ సంక్షోభ ప్రారంభం, దాని ప్రారంభదశ, మొదటి ప్రపంచ యుద్ధంతోనే ఆరంభమైనదని చెప్పొచ్చు. పోతే ఆ సంక్షోభం యొక్క ద్వితీయ దశ రెండవ ప్రపంచ యుద్ధంలో ప్రారంభమైంది. యిరోపా, ఆసియా ఖండాలలోని అనేక దేశాలు పెట్టుబడిద్వారీ వ్యవస్థను చీల్చుకొని, బయట పడటానికి ఆ యుద్ధం సహాయకారి అయింది.

పెట్టుబడిదారీ విధానానికి సంబధించిన జనరల్ సంక్షోభంయొక్క ప్రధాన లక్షణాలివి : ప్రపంచం రెండు వ్యవస్థలుగా, పెట్టుబడిదారీ, సామ్యవాద వ్యవస్థలుగా విభజింప బడటం; సామ్రాజ్యవాద వలస వ్యవస్థలో ప్రబలిన సంక్షోభం, మార్కెట్ల సమస్య గడ్డు సమస్యగా తయారవటం, తత్పర్యవసానంగా పరిశ్రమలు తమ ఉత్పత్తులను తగ్గించుకోవలసిన దుర్గతి దీర్ఘవ్యాధిలాగా పట్టుకొని పీడించటం, దానితో లక్షోప లక్షల ప్రజలు నిరుద్యోగులై అలమటిస్తూ ఉండటం—ఇవే ఆ ప్రధాన లక్షణాలు. ఈ లక్షణాల ప్రకోపాన్ని బట్టే, పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభ స్వరూప, స్వభావాలూ, ఆ సంక్షోభంలోని వివిధ దశలూ, ఆ యా దశలకు సంబంధించిన విశిష్ట లక్షణాలూ నిర్ణయించబడుతూ ఉంటాయి.

# 1. రెండు వ్యవస్థలుగా - పెట్టుబడిదారీ, సామ్యవాద వ్యవస్థలుగా - ప్రపంచ విభజన

రెండు వ్యవస్థలక్రింద – పెట్టుబడిదారీ, సామ్యవాద వ్యవస్థలుగా – ప్రపంచం విభజించబడటం, పెట్టుబడిదారీవ్యవస్థ క్రమేణా బలహీనపడుతూండటం, అదే సమయంలో సామ్యవాద వ్యవస్థ దిన దిన ప్రవర్థమానమవుతూ బలపడుతూండటం దీనంతటివల్లా పెట్టుబడిదారీ వైరుధ్యాలు తీవ్రరూపం ధరించటం పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభ స్వరూప, స్వభావాలను ప్రధానంగా నిర్ధరిస్తున్న లక్షణాం ఇదే. మహత్తర అక్టోబరు సామ్యవాద విప్లవం జయప్రదమై, ప్రపంచ అగ్రరాజ్యాల్లో ఒకటైన రష్యా సామ్రాజ్యవాద వ్యవస్థను చీల్చుకొని బయటపడటంతో, ఆనాటివరకూ సర్వసమన్వితమైన ఏకైక ప్రపంచ ఆర్థిక వ్యవస్థగా ఉంటూ వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థ, ఆ సర్వసమన్విత ఏకైక లక్షణాన్ని కోల్పోయింది. పెట్టుబడిదారీ వ్యవస్థ సరసనే, నూతన సామ్యవాద ఆర్థికవ్యవస్థ ఒకటి, సోవియట్ యూనియన్‌లో అవతరించి, దిన దిన ప్రవర్థమానమవుతూ తన విశిష్టతనూ, అప్రతిహత శక్తిసామర్థ్యాలను నిరూపించుకొనసాగింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం సామ్రాజ్యవాద యినుప సంకెళ్ళలో మరికొన్ని లింకులు తునాతునకలై పోయాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ కబంధహస్తాల కౌగిలినుండి పోలెండు, చెకోస్లావేకియా, హంగరీ, రుమేనియా, బల్గేరియా, ఆల్బేనియా దేశాలు బయటపడి, సామ్యవాద పురోభివృద్ధి

మార్గం చేపట్టాయి. చైనాప్రజల విప్లవం జయప్రదం కావటం, సామ్రాజ్య వ్యవస్థతో పూర్తిగా తెగతెంపులు చేసుకొని, చైనాదేశం బయటపడటం — నిజంగా ఈ రెండూ ప్రపంచ-చారిత్రక ప్రాధాన్యంగల సంఘటనలు. రెండో ప్రపంచ యుద్ధానంతరం పెట్టుబడిదారీ విధానం యొక్క జనరల్ సంక్షోభం మరింత తీవ్రరూపం ధరించటానికి పైన పేర్కొన్న విషయాలు దోహదమిచ్చాయి; పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థకు గోరుచుట్టుపై రోకటిపోటువలె అదనంగా నష్టాలు వాటిల్లి, ఆ వ్యవస్థ మరింతగా బలహీన పడటానికి పై విషయాలు దారితీసాయి. మరొకప్రక్క ప్రవర్థమాన మవుతున్న సామ్యవాద వ్యవస్థ మరింతగా బలపడింది. పెట్టుబడిదారీ విధానం యొక్క జనరల్ సంక్షోభం ప్రారంభదశలో ఒక్క సోవియట్ యూనియన్ మాత్రమే సామ్యవాద దేశంగా ఉంటూ వచ్చింది. కాని, రెండవ ప్రపంచ యుద్ధానంతరం, పెట్టుబడిదారీ వ్యవస్థ పరిధిని చీల్చుకొని, బయటపడిన ఐరోపా, ఆసియా దేశాలు, సోవియట్ యూనియన్ సరసను సమీకృతమై, బలోపేతమైన సామ్యవాద శాంతిశిబిరంగా ఏర్పడ్డాయి. అంతర్జాతీయ రంగంలో సోవియట్ యూనియన్ ఏకాకిగా జీవితం వెళ్ళబుచ్చవలసినస్థితి గతించిపోయింది.

బలోపేతమైన సామ్యవాద శిబిరం అవతరించటంతో అంతర్జాతీయ రంగంలో మరొక ముఖ్యమైన పరిణామం వచ్చింది. సామ్రాజ్యవాదంనుంచి పూర్తిగా తెగతెంపులు చేసుకొన్న దేశాలు సోవియట్ యూనియన్ సరసను సమీకృతం కావటంతో వాటి మధ్య ఆర్థిక సంబంధ బాంధవ్యాలు

బలపడ్డాయి; సర్వతోముఖమైన ఆర్థిక సంబంధాలను అవి పరస్పరం ఏర్పరచుకొన్నాయి. ఆ విధంగా, పెట్టుబడిదారీ ప్రపంచ ఆర్థికవ్యవస్థ సరసనే, సామ్యవాద ప్రపంచ ఆర్థిక వ్యవస్థ నూతన సంబంధాలతోను, నూతన పరిణామ క్రమ సూత్రాలతోను అభివృద్ధిచెందుతూ బలపడుతోంది.

దోపిడీ, ఉత్పత్తి అరాచకత్వం, పోటాపోటీలకు నిలయమైన పెట్టుబడిదారీ ఆర్థికసూత్రాలు, సామ్యవాద శిబిరంలోని దేశాలమధ్య గల సంబంధాలకు వర్తించటంలేదు. సోషలిజం, కమ్యూనిజం లక్ష్యంగా పెట్టుకొని, పురోగమిస్తున్న ఈ దేశాల మధ్యగల సంబంధాలు, సామ్యవాద ఆర్థికసూత్రాల ప్రాతిపదికపై, ఏర్పడ్డాయి.

వెనకబడిన దేశాల ఆర్థికవ్యవస్థలపై ఆధిపత్యం సంపాదించి, వాటిని సామ్రాజ్యవాదదేశాలు తమ ఆర్థికవ్యవస్థలకింద కీలుబొమ్మలుగా తయారు చేయటం, ఆర్థికంగా వెనకబడిన దేశాల ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాలను హరించి, వాటిని వలస, అర్ధవలస ప్రాంతాలుగా మార్చటం, ఆ దేశ ప్రజలను దారుణమైన దోపిడీకి గురిచేయటం, గుత్త పారిశ్రామిక దేశాలు ఆ వలస ప్రాంతాలకోసం గుద్దులాడుకోటం – ఇవే పెట్టుబడిదారీ ప్రపంచ ఆర్థికవ్యవస్థలోని స్వతస్సిద్ధ లక్షణాలు.

సమానహోదా గలిగిన, సర్వతంత్ర స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన వివిధ దేశాలు తమలో తాము సర్వతోముఖ ఆర్థిక సహకారం ఉభయతారక పద్ధతిలో నెరపుకోటం, బాగా అభివృద్ధిచెందిన దేశాలు అంతగా అభివృద్ధిచెందని దేశాలకు నిస్వార్థదృష్టితో సహాయం చేయటం, తమ తమ సహజ సంప

దలను, శక్తిస్తోమతలను యిత్యధికం చేసేందుకు ఉపయుక్తమైన పద్ధతిలో వివిధ దేశాల ఆర్థిక ప్రణాళికలమధ్య సమన్వయ సాధన – ఇవీ సామ్యవాద ప్రపంచ ఆర్థికవ్యవస్థయొక్క విశిష్ట లక్షణాలు.

సామ్యవాద శిబిరంలోని దేశాలమధ్య ఏర్పడుతున్న ఆర్థిక సంబంధ బాంధవ్యాలలో, ఆర్థిక సహకారం వివిధ రూపాలు తీసుకోటం మనం చూస్తున్నాం. వాటిలో ముఖ్యమైనవి ఇవి: అంతర్వాణిజ్యం, రుణాల మంజూరీ, శాస్త్రీయ, సాంకేతిక సహాయం, సాంకేతిక నిపుణులకు శిక్షణగరపటం, అన్నిటికన్నా ముఖ్యమైనది ఆయాదేశాల సహజసంపదలకు, ఆర్థిక స్థితిగతులకు అనుగుణమైన విధంగానే ఈ దేశాల ఆర్థికాభివృద్ధి ప్రణాళికల్లో సమన్వయం సాధించటం. పెట్టుబడి దారీ విధానంయొక్క జనరల్ సంక్షోభ ప్రారంభ దశలో, సోవియట్ యూనియన్ ఒక్కటే సామ్యవాద దేశంగాఉంటూ వచ్చిందికనుక, ఆధునిక పరిశ్రమలకు సంబంధించిన అన్ని శాఖలనూ, ముఖ్యంగా భారీ పరిశ్రమలను – సామ్యవాద పునర్నిర్మాణానికి వెన్నెముక కనదగిన భారీ పరిశ్రమలను – ఎన్నో సాధక బాధకాలకు లోనవుతూ, ముక్కు బిగువున అభివృద్ధి చేసుకోవలసివచ్చింది. అయితే, నూతన ప్రజాతంత్ర దేశాలు అలాంటి పృథుతర కర్తవ్యం – పరిశ్రమలకు చెందిన అన్ని శాఖలనూ ప్రతిదేశంలోనూ అభివృద్ధి చేసుకొనేబాధ్యత నెత్తి నేసుకొని – నిర్వహించవలసిన అవసరంకానీ, నిర్వహించ గలిగిన స్తోమతగానీ లేదు. సామ్యవాద శిబిరంలో ఆ దేశాలున్నందువల్ల, తమకుగల సహజసంపద, ఆర్థిక స్థితిగతులకు

అనుగుణమైన పరిశ్రమలనే మొదట స్థాపించుకొని, విస్తరింప చేసుకోటానికి సదవకాశం చేకూర్చింది.

ఆ విధంగా సామ్యవాద శిబిరంలోని దేశాలమధ్య అభివృద్ధి చెందుతూ, పటిష్ఠతరమవుతున్న ఆర్థిక సహకారంవల్ల నూతనమైన అంతర్జాతీయ సామ్యవాద శ్రమవిభజన అనేదొకటి తలెత్తుతున్నది. ఆయా దేశాల సహజ సంపదలను సమర్థవంతంగా, సందర్భోచితంగా వినియోగించుకొని, ఆర్థికాభివృద్ధిని త్వరితంగా సాధించుకొనేందుకు ఆ శ్రమ విభజన తిరుగులేని సాధన మవుతున్నది.

సామ్యవాద ప్రపంచ ఆర్థికవ్యవస్థ దిన దిన ప్రవర్థమాన మవుతున్నది. ఈ నూతన వ్యవస్థ ముందు పెట్టుబడిదారీవ్యవస్థ సూర్యుని సమక్షానవున్న దివిటీవలె మారిపోయింది. ఆర్థిక సంక్షోభం, ఆర్థికస్థంభనలవంటి రోగాలకు అతీతమైన సామ్యవాద శిబిరంలోని ఈ దేశాల ఆర్థికస్థితిగతులు నిరంతరం, నిర్విరామాభివృద్ధి చెందుతున్నాయి. ఆ దేశాల ప్రజలకు సంతృప్తికరమైన జీవన సౌఖ్యానందాలు సమకూడుతున్నాయి.

ఐరోపా, ఆసియాఖండాలలోని దేశా లనేకం ప్రపంచ పెట్టుబడిదారీవ్యవస్థనుంచి వేరుపడటంతో, సామ్రాజ్యవాద శక్తులస్థితి మరీ యిరకాటంలో పడింది; దోపిడీ చేసుకొనే ప్రాంతాలు కుంచించుకొని పోయాయి. దానితో పెట్టుబడిదారీ మార్కెట్టు సమస్య విషమించింది. పెట్టుబడిదారీ విధానం యొక్క జనరల్ సంక్షోభ ద్వితీయదశలో, సామ్రాజ్యవాద వ్యవస్థను చీల్చుకొని ఇంకా అనేక దేశాలు బయటపడినందు వల్లనూ, బలోపేతమైన సామ్యవాద శిబిరం అవతరించినందు

వల్లనూ సర్వసమన్వితమైన ఏకైక ప్రపంచమార్కెట్టు విచ్ఛిన్నమై, దానిస్థానే పరస్పరాభిముఖమై తారసిల్లిన రెండు ప్రపంచ మార్కెట్లు ప్రత్యక్షమయ్యాయి. అందులో ఒకటి ప్రజాతంత్ర శిబిరంలోని దేశాలకు సంబంధించినదికాగా, రెండవది సామ్రాజ్యవాదకూటమి దేశాలకు చెందినది. విభిన్న ప్రాతిపదికలపై ఏర్పడిన ఆ రెండూ విభిన్న పరిణామక్రమ సూత్రాలను కలిగివున్నాయి. క్రయ, విక్రయ సమస్య విషమించటం కాని, అపారోత్పత్తివల్ల సంక్షోభాలు ఉప్పతిల్లటం కాని కొత్తగా ఏర్పడిన ప్రజాతంత్రమార్కెట్టుకు దురూహ్యమైన విషయాలు. ప్రజాతంత్ర శిబిరంలోని దేశాలలో ఏ యేటి కాయేడు ఉత్పత్తి పెరుగుదలతోపాటు, దానికి తగినట్టుగా ఆ దేశాల ప్రజల కొనుగోలుశక్తి అభివృద్ధిచెందుతోంది. ప్రజల జీవనస్థితిగతులు మరింతగా అభివృద్ధి చెందుతున్నాయి.

బలోపేతమైన సామ్యవాద శిబిరమేర్పడి, దినదినప్రవర్ధమాన మవుతూన్నందువల్ల ప్రపంచశక్తుల బలాబలాలలో విపరీతమైన మార్పువచ్చింది; అందులోను ఆ మార్పు సామ్యవాదానికి అనుకూలంగానూ, పెట్టుబడిదారీ విధానానికి ప్రాణాంతకంగానూ ఉంది.

# 2. సామ్రాజ్యవాద వలసవ్యవస్థలో తీవ్రమైన సంక్షోభం

పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభానికి సంబంధించిన మూల లక్షణాలలో, సామ్రాజ్యవాద వలస వ్యవస్థ తీవ్రసంక్షోభానికి గురికావటం ఒకటి. ఈ సంక్షోభం యొక్క ప్రధాన లక్షణాలు ఇవి: వలసప్రాంతాలలో పరిశ్రమలు, దేశీయ పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందటం; దాని వల్ల మార్కెట్ సమస్య విషమించి, క్లిష్టతరం కావటం, వలసప్రాంతాలలోకూడా పారిశ్రామిక కార్మికవర్గం ఏర్పడటం; వలసప్రాంతాల ప్రజల జాతీయ విమోచనోద్యమాలు కార్మిక వర్గనాయకత్వాన అభివృద్ధి చెందటం, గుత్తపారిశ్రామిక దేశాల లోని విప్లవకర కార్మికోద్యమంతో ఆ జాతీయోద్యమాలు చేతులు కలపటం—ఇవే ఆ సంక్షోభాన్ని సూచించే ప్రధాన లక్షణాలు.

వలస, పరాధీన దేశాలలో జాతీయ పరిశ్రమలు, దేశీయ పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందటానికి మొదటి ప్రపంచయుద్ధంకన్నా మిన్నగా రెండో ప్రపంచయుద్ధం దోహదం చేసింది. ఇండియా, ఇండొనేషియా, లాటిన్ అమెరికా దేశాలలో, అలాగే మరికొన్నిచోట్ల పరిశ్రమలు గణించదగినంతగా అభివృద్ధి చెందాయి. ఎంతో వెనకబడివున్న ఆఫ్రికా ఖండంలోని వలసప్రాంతాలుసైతం క్రమానుగతమైన పారిశ్రామికాభివృద్ధి పుంత చేపట్టాయి.

[కొన్ని దేశాల పారిశ్రామికోత్పత్తి పెరుగుదల (1948=100)]

| సంవత్సరం | దక్షిణ రొడీషియా | మొరాకో (ముడిసరుకులు త్రవ్వితీసే పరిశ్రమలు) | ఆల్జీరియా ముడి సరుకులు త్రవ్వితీసే పరిశ్రమలు | మెక్సికో | చిలీ | ఇండియా |
|---|---|---|---|---|---|---|
| 1937 | — | — | 67 | 76 | 62 | 84 |
| 1938 | 67 | 52 | 82 | 76 | 64 | 89 |
| 1944 | 80 | 43 | — | 87 | 79 | 99 |
| 1945 | 85 | 47 | — | 93 | 87 | 101 |
| 1946 | 91 | 75 | — | 96 | 98 | 92 |
| 1947 | 92 | 89 | — | 100 | 97 | 89 |
| 1948 | 100 | 100 | 100 | 100 | 100 | 100 |
| 1949 | 113 | 110 | — | 107 | 104 | 95 |
| 1950 | 125 | 127 | 124 | 118 | 104 | 96 |
| 1951 | 137 | 165 | 135 | 127 | 119 | 108 |
| 1952 | — | 170 | 148 | 130 | 131 | 118 |
| 1953 | — | 175 | 164 | 133 | 148 | 124 |

భారత దేశంలోని 1953 సంవత్సరపు పారిశ్రామికోత్పత్తి స్థాయిని యుద్ధాత్పూర్వపు స్థాయితో పోల్చి చూసినప్పుడు, 47.5% పెరుగుదల కన్పిస్తుంది. అలాగే మెక్సికోలో 75%, చిలీలో 130% పెరుగుదల కన్పిస్తుంది.

వలస, పరాధీన దేశాలలో మనకు కన్పించే పారిశ్రామికాభివృద్ధి ముడి సరుకులు త్రవ్వితీసే పరిశ్రమలకూ (ఎక్స్ట్రాక్టింగ్ ఇండస్ట్రీస్) జీవితోపయోగ వస్తువులు తయారుచేసే పరిశ్రమలకూ (లైట్ ఇండస్ట్రీస్), రవాణా పరిశ్రమలకూ

మాత్రమే పరిమితమై వున్నదని వేరే చెప్పనవసరంలేదు. వలస, పరాధీన ప్రాంతాలపై పెత్తనం చలాయిస్తూ, దారిదోపిడీ విధానంవంటిదాన్ని అవలంబిస్తున్న సామ్రాజ్య దేశాలు సాంకేతిక – ఆర్థిక స్వేచ్ఛకు మూలాధారమైన భారీపరిశ్రమలు, యంత్రనిర్మాణం వలస, పరాధీన ప్రాంతాలలో అభివృద్ధిచెందకుండా అరికట్టుతున్నాయి. ఏమైనప్పటికీ, వలస, పరాధీనదేశాలయొక్క పరిమిత పారిశ్రామికాభివృద్ధికూడా, ఒకప్రక్క ఆ దేశాలు విదేశ మార్కెట్లలోకి ప్రవేశించటానికి, మరొకప్రక్క ఆ దేశాలలో కార్మికవర్గ సంఖ్యాబలం పెరగటానికి దారితీసిందనే చెప్పాలి. ఉదాహరణకు, భారతదేశంలో 1938 – 1944 మధ్య కాలంలో పెద్దఎత్తున జీవితోపయోగ వస్తువులు తయారు చేసే కార్మికుల సంఖ్య నూటికి 45 వంతులు పెరిగింది. దక్షిణాఫ్రికాలో జీవితోపయోగవస్తువులు తయారుచేసే పరిశ్రమలలో పనిచేసే కార్మికుల సంఖ్య, 1938–1952 మధ్యకాలంలో 2.4 రెట్లు పెరిగింది. 1953 సంవత్సరం ఇండొనేషియాలో ఫ్యాక్టరీలలోను, ఆఫీసులలోను పనిచేసే కార్మికులసంఖ్య 37,50,000. ఆఫ్రికాలోని వలసప్రాంతాలలో నియమించిన కూలీలసంఖ్య పరికిస్తే, పరిస్థితి మనకు మరింత సులభంగా అర్థమవుతుంది. ఉదాహరణకు 1936–48 మధ్యకాలంలో కూలీల సంఖ్య ఇలా పెరిగింది: బెల్జియన్ కాంగో—4,91,500 నుంచి 8,20,000 వరకూ, కెన్యాలో 2,13,700 నుంచి 3,94,900 వరకూ, దక్షిణ రొడీషియాలో 21,54,300 నుంచి 3,76,900

వరకూ, టాంగానికాలో 2,43,400 నుంచి 3,95,500 వరకూ పెరిగింది.

ఆవిధంగా సామ్రాజ్యవాద దోపిడీకి ఆటపట్టయిన, యెంతో వెనకబడియున్న వలస ప్రాంతాలలోకూడా పారిశ్రామిక కార్మిక సేనావాహినులు ప్రత్యక్ష మయ్యాయి. అనేక వలసదేశాలలో బలీయమైన కార్మిక సంఘాలు – ఇండోనేషియా సెంట్రల్ ట్రేడ్ యూనియన్ ఆర్గనైజేషన్, అఖిల బర్మా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, ఈజిప్షియన్ ట్రేడ్ యూనియెన్ కాంగ్రెస్, ట్రేడ్ యూనియన్ వర్కర్స్ ఆఫ్ ట్యునీషియా, జనరల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ యూనియన్స్ ఆఫ్ మొరాకో, నైగీరియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యిత్యాదులు–యుద్ధానంతరం తలెత్తి, సుసంఘటితమయ్యాయి. కార్మికుల సంఖ్యాబలం హెచ్చినందువల్లా, అలాగే కార్మిక సంస్థలు సుసంఘటితం కావటంవల్లా పీడితజాతుల జాతీయ విమోచనోద్యమాలకు జీవం, బలం సమకూడింది; ఆ ఉద్యమాలు ఉన్నతస్థాయి నందుకొన్నాయి.

వలస, పరాధీన దేశాల జాతీయ విమోచనోద్యమంలో వచ్చిన కొత్త వెల్లువ పెట్టుబడిదారీ విధాన మొక్క జనరల్ సంక్షోభ ద్వితీయ దశను సూచిస్తుంది. పాతపద్ధతిలో, సామ్రాజ్యవాద శృంఖలాలమధ్య జీవించటానికి ఆ దేశ ప్రజలు యింకెంతమాత్రం యిచ్ఛగించటంలేదు. వలస దేశాలలోని ప్రజలు, కార్మికవర్గ నాయకత్వాన పెద్ద ఎత్తున సాగిస్తున్న సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలే అందుకు ప్రబలతార్కాణము. ఆ పోరాటాలయొక్క స్వరూప, స్వభావాలలో గర్భి

భూతమైయున్న ఉద్వేగం వర్తమానదశలో సామ్రాజ్యవాద వలసవ్యవస్థ చిన్నాభిన్నం కావటానికి కారణభూతమవుతోంది.

వలస వ్యవస్థ క్రమంగా నేలకూలుతోందని మనకు స్పష్టంగా కన్పిస్తోంది. అనేక వలస, అర్థవలస దేశాలు సామ్రాజ్యవాదవ్యవస్థ విషకౌగిలినుంచి బయటపడి, ప్రజాతంత్ర, స్వతంత్ర దేశాలుగా రూపొందాయి. చైనాలో సామ్రాజ్యవాదం భూస్థాపితం చేయబడటం, చైనా ప్రజా రిపబ్లిక్ ఏర్పడటం నిజంగా ప్రపంచ సామ్రాజ్యవాదానికి చావుదెబ్బ వంటిదని చెప్పాలి. చైనా మహత్తర ప్రజానీకం సాధించిన చారిత్రాత్మక విజయంవల్ల దూరప్రాచ్యంలోని పీడిత ప్రజల పోరాటం విప్లవ పరిణామం చెందింది; జాతీయ విమోచనంకోసం వలసదేశాలు సాగిస్తున్న పోరాటానికి నూతనోత్సాహం లభించింది. ప్రజాతంత్ర రాజ్యాలు అవతరించిన కొరియా, వియత్‌నామ్‌లలోకూడా సామ్రాజ్యవాద శ్రేణులకు గండ్లుపడ్డాయి.

అదే సమయంలో జాతీయ విమోచనోద్యమ ప్రాబల్య ప్రభావాల కారణంగా, వలస ప్రపంచంలోని యితర ప్రాంతాలలోకూడా పెద్దపెద్ద మార్పులు వస్తున్నాయి. బానిసత్వం నుంచి బయటపడటంకోసం జరిపిన నిర్విరామ పోరాటంవల్ల కొన్ని దేశాలు స్వాతంత్ర్యం పొందుతున్నాయి. ఉదాహరణకు యుద్ధానంతరం బ్రిటిషు సామ్రాజ్యవాదం తన వలస పరిపాలనను ఇండియానుంచి ఉపసంహరించుకొని, ఇండియా, బర్మా దేశాల స్వాతంత్ర్యం గుర్తించవలసి వచ్చింది. హాలెండు కూడా విధిలేక ఇండొనేషియా స్వాతంత్ర్యాన్ని గుర్తించింది. జాతీయ

విమోచన పోరాట ఫలితంగా, ఇండియా, ఇండొనేషియా, బర్మా, మరికొన్ని యితర దేశాలు స్వేచ్ఛాయుత, సర్వతంత్ర స్వతంత్ర అభివృద్ధిధారక పంథాను స్వీకరించాయి. హద్దూ పద్దూ లేకుండా సాగుతూవచ్చిన సామ్రాజ్యపాలన ఆ విధంగా కుంచించుకొని పోతోంది. ఆఫ్రికావాసులుకూడా సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా, సంకల్పసిద్ధులై పోరాటంలోకి దుముకుతున్నారు.

'మూలిగే నక్కపై పడిన తాటికాయలాగా' పైన పేర్కొన్న విషయాలు సామ్రాజ్యవాద రాజ్యాలకు కొత్త చిక్కులు తెచ్చిపెట్టాయి. సామ్రాజ్యవాద దేశాలు ఎదు ర్కొనే కష్టనష్టాలను, వాటిమధ్య పొడసూపే వైరుధ్యాలను వలసప్రజల నెత్తిపై రుద్దుతూ, అంటే వలస, పరాధీన దేశాల ప్రజలను మరింతదారుణంగా దోపిడీ చేయటంద్వారా, తాము ఆ గండం నుంచి గట్టెక్కుతూవచ్చాయి. దోపిడీకి ఆటపట్టయిన వలసప్రాంతాలు నానాటికీ తగ్గిపోతూ, వాటిపై సామ్రాజ్య వాదదేశాలు ఆధారపడటానికి వీలులేకుండా పోతోంది. సామ్రాజ్యవాద పదఘట్టనచే నలిగిపోతూ, ఎలాంటి హక్కు లకూ నోచుకోని వలసజాతులు పెనునిద్రవదలించుకొని, నూతన జీవితోత్సాహంపొంది ఒక కొత్త శక్తిగా అంతర్జాతీయ రంగంలో ప్రవేశిస్తున్నాయి. ఆ కొత్త శక్తిని గుర్తించ నిరాక రించటం సాధ్యంకాని విషయం.

# 2. రెండవ ప్రపంచ యుద్ధానంతరం దిగజారిన కార్మికుల జీవన స్థితిగతులు

పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికుల జీవనస్థితిగతులు అనుదినం దిగజారి పోతూండటం పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభ ద్వితీయదశకు మరొక తార్కాణంగా పేర్కొనవచ్చు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో గుత్తాధిపత్య పారిశ్రామిక సంస్థలు కలలోకూడా వూహించనంత అధికంగా లాభాలు ఆర్జించాయి. ఒకప్రక్క తక్కువ కూలియిచ్చి, ఎక్కువ ఫలితం సంపాదించే పెట్టుబడిదారీ దోపిడీతోపాటు, మరొకప్రక్క బడ్జెట్, ధరల నిర్ణయంవంటి తంత్రాలు వుపయోగించి, కార్మికవర్గాన్ని ఆ గుత్తాధిపత్య సంస్థలు మరింతగా కొల్లగొట్టాయి.

యుద్ధకాలంలో బూర్జువా పత్రికలు "యుద్ధానంతరం ప్రపంచ రూపురేఖలు" గురించి, కథలల్లి ప్రచారం చేశాయి. పెట్టుబడిదారీ విధానం 'క్రమబద్ధం' చేయబడుతుంది కనుక నిరుద్యోగం, సంక్షోభాలు నామరూపాలు లేకుండా తుడిచిపెట్టబడతాయనీ, ప్రజల జీవన ప్రమాణం క్రమానుగత అభివృద్ధి చెందుతూ వుంటుందనీ అవి ప్రచారం చేశాయి. కార్మికవర్గం తన హక్కుల కోసం ఎక్కడ పోరాడుతారోనని, ముందుగానే కార్మికుల మనస్సులపై మత్తుమందు చల్లి, వారిని మోసపుచ్చటమే ఆ ప్రచారంలోని అంతరార్థం. పెట్టుబడిదారీ విధానాన్ని కల్లబొల్లి కబుర్లతో సమర్థించాలని చూసినవారి ఉద్ఘాటనల లోని బండారాన్ని యుద్ధానంతర యథార్థ పరిస్థితులు బయట

పెట్టాయి. యుద్ధానంతరం ప్రజల జీవన స్థితిగతులు మరింత త్వరితంగా దిగజారిపోతున్నాయి.

రెండో ప్రపంచ యుద్ధం పుణ్యమా అంటూ కష్టజీవులు-ఆర్థికంగా ఎంతో అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలలోని కష్టజీవులతోసహా - తలకుమించిన పన్నులభారం మోయవలసి వచ్చింది. అమెరికా ప్రభుత్వానికి 1939 లో పన్నుల రూపంలో వచ్చిన ఆదాయం 480 కోట్ల 30 లక్షల డాలర్లుకాగా, 1943లో పన్నుల రూపంలో వచ్చిన ఆదాయం 4,098 కోట్ల 90 లక్షల డాలర్లకు పెరిగింది. అంటే పన్నులు 8½ రెట్లు పెంచబడ్డాయన్నమాట. బ్రిటను, జపాను తదితర పెట్టుబడిదారీ దేశాలలోకూడా పరిస్థితి యించుమించు యిదే విధంగావుంది.

పెరిగిపోయిన సైనిక వ్యయంతో ముడివడివున్న, పాపం లాగా పెరిగిపోయిన పన్నుల ఆదాయాన్ని, పన్నుల సంఖ్యను పెంచటంద్వారా రాబట్టుతున్నారు.

ఇదివరకు పన్ను విధింపునుంచి మినహాయించిన వారిపై యిప్పుడు కొత్తగా పన్నులు విధించారు. అలాగే, లోగడ వుంటూ వచ్చిన పన్నులను పెంచారు. రెండో ప్రపంచ యుద్ధం ముగియటంతో, ఆ యుద్ధంవల్ల తమపై పడిన అదనపు పన్నులభారం తొలగిపోతుందని కష్టజీవులు ఆశించారు. కాని, అలా ఆశించిన వారంతా ఆశాభంగం పొందారు; యుద్ధానంతరం పన్నులభారం తగ్గకపోగా అధికమైంది. అమెరికా ప్రభుత్వానికి పన్నుల రూపంలో వచ్చే ఆదాయం 1950వ సంవత్సరం వరకు, యుద్ధకాలంలో వచ్చే ఆదాయంతో యించుమించు సరితూగుతూ వచ్చింది. 1950 లగాయతూ అమెరికా ప్రభు

త్వం ప్రజలపై అధికపన్నులు వేయసాగింది. అందువల్ల, 1953 సంవత్సరం వచ్చేసరికి, పన్నుల రూపంలో అమెరికా ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం 62,65,60,00,000 డాలర్లకు పెరిగింది. అంటే, 1945 వ సంవత్సరంలో వచ్చిన ఆదాయం కన్నా, 1953 లో ఆదాయం నూటికి 52 వంతులు పెరిగిందన్న మాట.

బ్రిటనులోకూడా సరిగా అలాంటి పరిస్థితే వుంది. 1938-'39 సంవత్సరంలో పన్నులవల్ల బ్రిటిషు ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం 89,64,00,000 పౌనులు. 1944-'45 లో, అంటే రెండో ప్రపంచ యుద్ధం కడపటి సంవత్సరం, ఆదాయం 313,95,00,000 పౌనులు. 1948-'49 లో అది 367,93,00.000 పౌనులకు పెరిగింది. 1952-53 లో అది 429,67,00,000 పౌనులకు హెచ్చింది. ఒక్కమాటలో చెప్పాలంటే, అమెరికాలో వలెనే బ్రిటనులోకూడా, యుద్ధానంతరం ప్రజలపై పన్నులభారం తగ్గకపోగా, విపరీతంగా హెచ్చింది.

అందుకు కారణం ఏమిటి ?

పన్నులకు, జాతీయ ఋణానికి మధ్యగల సన్నిహిత సంబంధం అందుకు ప్రథమకారణంగా పేర్కొనవచ్చు. సామ్రాజ్యవాద దేశాలలో, యుద్ధకాలమందు ఎంత విపరీతంగా పన్నులను పెంచినా, హనుమంతుని తోకలాగా పెరిగిపోయే సైనిక వ్యయానికి వచ్చే ఆదాయం సరిపోదు. అందువల్ల ఆ దేశాల జాతీయ ఋణం పెరిగిపోతుంది. 1939 లో అమెరికా జాతీయ ఋణం 4040 కోట్ల డాలర్లుంటే, 1945 లో ఆ ఋణం 25,860 కోట్ల డాలర్లకు పెరిగిపోయింది. అలాగే బ్రిటను జాతీయ ఋణం 720

కోట్ల పౌనులనుంచి 2,150 కోట్ల పౌనులకు పెరిగింది. యుద్ధ కాలంలో జాతీయ రుణాలు పెరగటం అంటే అర్థం, యుద్ధానంతరం చాలాకాలం పాటు కష్టజీవులపై అదనపు పన్నులభారం పడిందన్నమాటే. ఎందుకంటే ప్రభుత్వం విపరీతమైన వడ్డీరేటు చెల్లిస్తూ, అదే సమయంలో రుణాలను కూడా తీసుకుంటూరావాలి. ఆ రుణదాతలు పెట్టుబడిదారులే కనుక, కష్టజీవుల సొమ్ము ఆ విధంగా వారికి చేరుతుంది. లెనిన్ వివరించినట్లు, యుద్ధకాల రుణాలు అంటే అర్థం, "ప్రజాసామాన్యాన్ని కొన్ని వందలరెట్లు ఎక్కువగా కొల్లగొట్టే పవిత్రమైన హక్కు" గుత్త పెట్టుబడి దార్లకు దక్కినట్లే; కోటానుకోట్ల సంఖ్యలోగల జాతీయ రుణాన్ని తీర్చటానికి, యుద్ధానంతరం చాలాకాలంపాటు తమ 'స్వేదం ఓడ్చి' కష్టించి పనిచేయవలసిన విధ్యుక్తధర్మం కష్ట జీవుల నెత్తిన పడిందన్నమాటే.

యుద్ధానంతరం పన్నుల పెరుగుదలకు మరొక కారణం కూడావుంది. గుత్తాధిపత్యసంస్థలు సాధ్యమైనంత అధిక లాభాలు ఆర్జించటానికి ప్రస్తుతం ప్రభుత్వబడ్జెట్‌ను ముఖ్యసాధ నంగా చేసుకొంటున్నారు. పన్నులరూపంలో వచ్చేఆదాయాన్ని, పరిపాలనా నిర్వహణ ఖర్చులకు మాత్రమేకాక, పెద్దపెద్ద పారి శ్రామిక సంస్థలనుంచి వస్తువులను విపరీతమైన ధరలకు ప్రభుత్వం ఖరీదు చేయటం, ఆ విధంగా ఆ సంస్థలకు అపార లాభాలను ప్రభుత్వమే ఆర్జించి పెట్టటం, అంతేకాకుండా తీర్చనవసరంలేని అప్పులు, ఆర్థికసహాయం పేరుతో పెట్టుబడిదారులకు పెద్దపెద్ద మొత్తాలను ప్రభుత్వం ముట్టచెపుతూండటం వంటి వాటికికూడా

ఆ ఆదాయాన్ని ధారాదత్తం చేస్తున్నారు. ఇందుకు ఉదాహరణగా ఈ క్రింది విషయం చూడండి :

అమెరికా రక్షణశాఖవారు పత్రికలకు విడుదలచేసిన ప్రకటనప్రకారం, 1950 జులైనుంచి 1953 జూన్ వరకు పారిశ్రామిక సంస్థలనుంచి ఖరీదుచేసిన యుద్ధావసర వస్తువుల మొత్తం విలువ 9,872 కోట్ల 30 లక్షల డాలర్లు అని తేల్చారు. అంటే 1950–'53 మధ్యకాలంలో సైనిక వ్యయంకోసం ప్రత్యేకించిన మొత్తంలో యిది నూటికి 94.5 వంతులు. ఈ మొత్తంలో నూటికి 64 వంతులు నూరు గుత్తాధిపత్య సంస్థలకు దక్కింది.

మొత్తంమీద యుద్ధకాలం లగాయతూ యిప్పటి వరకు పన్నులభారం అధికమవుతూనే వస్తోంది. అమెరికా – బ్రిటన్‌లలో ప్రస్తుతం విధించబడుతున్న పన్నులవల్ల కార్మిక కుటుంబాల ఆదాయంలో పెద్ద తోర్రపడుతోంది; ఫ్యాక్టరీల లోను, ఆఫీసుల్లోను పనిచేస్తున్నవారు తమ ఆదాయంలో యించుమించు మూడోభాగం పన్నులరూపంలో ప్రభుత్వానికి చెల్లిస్తున్నారు.

రెండో ప్రపంచయుద్ధం ఫలితంగా పెట్టుబడిదారీ దేశాలలో జీవనవ్యయం మొత్తంగా పెరిగింది; దానినే మరొక మాటలో చెప్పాలంటే కష్టజీవుల వాస్తవిక ఆదాయం పడిపోయిందన్నమాట. పెట్టుబడిదారీ దేశాలలో అధికారయుతంగా ప్రకటిస్తున్న జీవనవ్యయ సూచికలు (లివింగ్ ఇండిసెస్) వాస్తవిక స్థితిగతులను సూచించటంలేదు.

అధికారులు తయారుచేసిన తప్పుడు జీవన వ్యయసూచికలను సాకుగా తీసుకొని, పెట్టుబడిదారులు కార్మికుల వేత

నాలకు ఎసరపెట్టసాగారు. అందువల్ల జీవన వ్యయసూచికలను, ధరల సూచికలను స్వయంగా తయారుచేయటానికి కార్మిక సంఘాలే పూనుకొంటున్నాయి. ఉదాహరణకు అమెరికా యునైటెడ్ ఎలెక్ట్రికల్, రేడియో, మెషిన్ కార్మికుల సమాఖ్యవారు, ప్రభుత్వ కార్మిక శాఖవారు తయారుచేసిన జీవనవ్యయ సూచికను ఖండిస్తూ, అందులోని తప్పుడు లెక్కలను చూపిస్తూ, మరొక జీవన వ్యయసూచికను తయారుచేశారు. దానిప్రకారం అమెరికాలో 1939 సంవత్సరమందు జీవనవ్యయం 100 పాయింట్లు అనుకొంటే, 1945 లో అది 181.3 పాయింట్లకు పెరిగింది. 1952 సంవత్సరం వచ్చేసరికి అది 285.5 పాయింట్లకు హెచ్చింది. అమెరికాలో ఆ విధంగా జీవనవ్యయం అంతూపంతూ లేకుండా, యుద్ధకాలంలోనే జీవన వ్యయం విపరీతంగా పెరిగినదనుకొంటూంటే, అంతకన్నా విపరీతంగా యుద్ధానంతరం హెచ్చింది. యుద్ధాత్పూర్వంతో పోల్చిచూస్తే, ప్రస్తుతం అమెరికాలోని జీవనవ్యయం ఇంచుమించు మూడురెట్లు హెచ్చు.

పరిస్థితులిలా వున్నప్పుడు, ఫ్యాక్టరీలలోను, ఆఫీసులలోను పనిచేస్తున్నవారి వాస్తవికఆదాయం పడిపోయిందని వేరే చెప్పాలా? పెట్టుబడిదారీ దేశాలన్నింటిలోను, బాగా అభివృద్ధిచెందిన దేశాలతోసహా, యుద్ధాత్పూర్వంకన్నా ఈనాడు ప్రజల వాస్తవిక ఆదాయం చాలా తక్కువగా వుంది. నామమాత్రంగా పెంచిన, కష్టజీవుల జీతాలు వేస్తున్న అధికపన్నులకు, పెరుగుతున్న జీవనవ్యయానికి తగినట్టుగా జీతాలు పెంపుదలలేదు. పెట్టుబడిదారీ దేశాలలో అధికార

యుతంగా విడుదల చేసిన సమాచారంలోనే పై విషయం స్పష్టంగా మనకు గోచరిస్తుంది. అమెరికా ప్రభుత్వ కార్మిక శాఖవారు పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికుల వారంవారం సంపాదన గురించిన భోగట్టాని విడుదల చేస్తుంటారు. అందులో కార్మికుల నామమాత్రపు జీతాలు (నామినల్ వేజెస్)తోపాటు "1947-49 డాలరుతో పోల్చితేకూడా" ఆ సంపాదనను వివరిస్తుంటారు. (అంటే జీవితోపయోగ వస్తువుల ధరల సూచికను ప్రత్యక్ష పన్నులనుకూడా పరిగణనలోకి తీసుకొనటంద్వారా ఆ లెక్కలు తయారు చేస్తారు.) ఆ లెక్కలనుబట్టి చూసినా, యుద్ధానంతరకాలంలో ఎప్పుడుకూడా అమెరికాలో కార్మికుల సంపాదన 1944 స్థాయికి చేరుకోలేదని మనకు స్పష్టం అవుతుంది. ప్రస్తుతం కార్మికుల సంపాదన, 1944తో పోల్చుకుంటే నూటికి 95 వంతులు మాత్రమే వున్నట్లు ఆ లెక్కలనుబట్టి తేలుతుంది. నిజానికి అమెరికాలో కార్మికుల వాస్తవిక వేతనాలు ఇంకా చాలా హెచ్చుగానే పడిపోయాయి.

1944 సంవత్సరంతో పోల్చుకుంటే అమెరికాలో కార్మికుల వాస్తవిక వేతనాలు పడిపోయాయని పైన తెలుసుకున్నాం. పోతే 1939 సంవత్సరంతో పోల్చుకుంటే, వారి వాస్తవిక వేతనాలు మరింతగా తగ్గిపోయాయి. ఉదాహరణకు, ప్రగతిశీల అమెరికన్ పత్రిక 'ఎకనమిక్ నోట్స్'లో ప్రచురితమైన లెక్కలను ఇక్కడ ఉదహరిస్తున్నాం. అమెరికాలోని ఆటోమొబైల్ పరిశ్రమలో పనిచేస్తున్న కార్మికుల వాస్తవిక వేతనాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

కార్మికుల వాస్తవిక వేతనాల సూచిక (1938=100)

| సంవత్సరం | సగటు వారాదాయం | పన్నులతో సహా జీవనవ్యయ సూచిక | వాస్తవిక వారాదాయం |
|---|---|---|---|
| 1939 | 100 | 100 | 100 |
| 1947 | 174.9 | 219.6 | 79.6 |
| 1948 | 188.3 | 234.0 | 80.5 |
| 1949 | 200.8 | 230.7 | 87.0 |
| 1950 | 213.0 | 245.6 | 91.9 |
| 1951 | 229.7 | 272.3 | 84.4 |
| 1952 | 252.8 | 285.5 | 88.5 |

1952 లో అమెరికా అటోమొబైల్ కార్మికుల వాస్తవిక వేతనాలు, పన్నుల, జీవనవ్యయ పెరుగుదలలను పరిగణన లోకి తీసుకొని చూసినప్పుడు, 1939 నాటి వేతనాల కన్నా నూటికి దాదాపు 12 వంతులు తగ్గిపోయాయి. కొంతమంది బూర్జువా ఆర్థిక వేత్తలు నుడివినట్లుగా, ప్రపంచ యుద్ధంవల్ల కార్మికులు ఆర్థికంగా బాగుపడకపోగా, దివాళా తీస్తున్నారని పై పట్టికనుబట్టి రుజువు అవుతోంది. యుద్ధంవల్ల ఆర్థికంగా ఎంతగానో బాగుపడిన అమెరికా వంటి దేశంలో కూడా, యుద్ధాత్మక, సైనికాత్మక ఆర్థిక వ్యవస్థవల్ల కార్మికవర్గం ఏమాత్రం బాగుపడకపోగా, యుద్ధానంతర దశలో మరింత దారుణమైన దోపిడీకి, పేదరికానికి గురిచేయబడుతోంది.

కార్మికుల వేతనాలను, హెల్లర్ బడ్జెట్‌తో పోల్చి చూసినప్పుడు, మనకు విషయం సుబోధకమవుతుంది. నలుగురు వ్యక్తులుండే కార్మికకుటుంబానికి (భర్త, భార్య, ఇద్దరుపిల్లలు) అయ్యే కనీస ఖర్చుల ప్రాతిపదికపై హెల్లర్ కమిటీ గృహ

బడ్జెట్‌ను తయారుచేసింది. ఆ బడ్జెట్‌తో కార్మికుల వాస్తవిక వేతనాలను పోల్చి చూసినప్పుడు, 1945 మార్చిలో హెల్లర్ కమిటీ సూచించిన కనీస అవసరాల కయ్యే ఖర్చులకు 11.64 డాలర్లు తక్కువగా కార్మికుల వారం వారం ఆదాయం ఉంది. 1950 అక్టోబరులో ఆ లోటు 20.24 డాలర్లకు పెరిగింది; 1953 సెప్టెంబరులో ఆ లోటు 32.52 డాలర్లకు హెచ్చింది. అందు వల్ల యుద్ధానంతరం దశలో, కార్మికుల వాస్తవిక వేతనాలకు కార్మిక కుటుంబాల కనీస అవసరాలకు మధ్యగల తేడా తగ్గక పోగా, ఆ యేటికా యేడు పెరిగి పోతూనే ఉంది.

యుద్ధానంతరం బ్రిటనులోని పరిస్థితికూడా అందుకు ఏమాత్రం భిన్నంగాలేదు. బ్రిటిష్ ప్రభుత్వం విడుదలజేసిన లెక్కలనుబట్టి జూచినా, గత ఆరు సంవత్సరాలలోను బ్రిటిషు కార్మికుల వాస్తవిక వేతనాలు, 1947 నాటి వేతనాల స్థాయి కన్నా తక్కువగానే ఉన్నట్లు స్పష్టమవుతుంది. అమెరికాలోని కార్మికవర్గం వలెనే, బ్రిటిషు కార్మికవర్గ జీవన స్థితిగతులు యుద్ధా నంతరం బాగుపడకపోగా, యుద్ధాత్పూర్వంకన్నా దిగజారాయి. ఇక వలస, పరాధీన దేశాలలోని కార్మికుల పరిస్థితి మరింత త్వరితంగా దిగజారిపోతున్నదని వేరే చెప్పాలా !

ఏకప్రపంచ మార్కెటు విచ్ఛిన్నంకావటం, వలస వ్యవ స్థలో తీవ్రతరమవుతున్న సంక్షోభం, యుద్ధాత్మక, సైనికాత్మక ఆర్థికవ్యవస్థ, దానితోపాటు ప్రజల దివాళాకోరుతనం – ఇవన్నీ కూడా పెట్టుబడిదారీ మార్కెట్టు సమస్యను మరింత తీవ్రతరం చేయక మానవు; విక్రయావకాశాలను బాగా పరిమితం చేయకా మానవు. దానితో అనేక పరిశ్రమలు తమ ఉత్ప

త్తిని విధిలేక తగ్గించుకోవలసి వస్తుంది; అప్పుడు నిరుద్యోగ సమస్య దీర్ఘకాలవ్యాధిగా పరిణమించక మానదు. ఉదాహరణకు అమెరికాలోని నిరుద్యోగుల సంఖ్యనే తీసుకోండి: యుద్ధానంతరం అమెరికాలోని మొత్తం నిరుద్యోగులసంఖ్య ఏనాడు కూడా 45 లక్షలకు తగ్గలేదు. ఈసందర్భంలోనే పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభ ద్వితీయ దశకు చెందిన రెండు నూతన లక్షణాలను మనం పరిశీలించవలసి ఉంటుంది. మొదటిది: అమెరికన్ సామ్రాజ్యవాదులు తమ ఆర్థిక వ్యవస్థను సైనికాత్మక ఆర్థిక వ్యవస్థగామార్చి, కొత్త ప్రపంచ యుద్ధానికి ఆయత్తమవుతున్నారు. దీనివల్ల యుద్ధానంతరం పెట్టుబడిదారీ దేశాలలో విపరీతసంఖ్యలో సైనికబలాలను నిర్మించటం, పెద్దఎత్తున యుద్ధపరిశ్రమలను విస్తరింపచేయటం జరుగుతూంది.

ఉదాహరణకు అమెరికాలో 1952 సంవత్సరమందు సైనికులసంఖ్య 36,35,000 అని అధికారయుత లెక్కలనుబట్టే తేలుతోంది. (యుద్ధాత్పూర్వం 1925–30 మధ్యకాలంలో అమెరికా సైన్యం సంఖ్య 2,50,000; 3,00,000 వుండేది) రెండవది: యుద్ధానంతర దశలో తమ నెత్తిమీదకు వచ్చిపడిన, 'ఉత్పత్తిని విధిలేక తగ్గించుకోవలసిన దుర్గతినీ', అలాగే 'నిరుద్యోగ సమస్యనూ' విదేశాలకు, ముఖ్యంగా ఆర్థికంగా వెనకబడిన దేశాలకు అమెరికన్ గుత్తాధిపత్య సంస్థలు 'ఎగుమతి' చేయజూస్తున్నాయి.

పారిశ్రామిక రంగంలో దీర్ఘకాల వ్యాధిగా తయారైన నిరుద్యోగ సమస్య వ్యావసాయక రంగంలో మరికొన్ని

కష్టాలను తెచ్చిపెట్టుతుంది; పారిశ్రామిక రంగంలోనే నిరుద్యోగుల సంఖ్య కోట్లలుగా ఉన్నప్పుడు, యిక పల్లెప్రాంతాలలో పనిపాటలు లభ్యంకాని వ్యావసాయక ప్రజానీకం పని కోసం పట్టణాలకు ఎక్కటానికి సాధ్యం కాదుగదా? అయినప్పుడు వ్యావసాయక రంగంలో పనిపాటలు లేకుండా మిగిలిపోయే జనం పెరిగిపోతారు. దీనంతటి వల్లా అటు పల్లెప్రాంతాలలోను, ఇటు పట్టణాలలోను కూడా ప్రజలు దివాళాకోరుతనంలో పడిపోతారు. తత్పర్యవసానంగా ప్రజల కొనుగోలు శక్తి విపరీతంగా పడిపోవటం, వస్తువులు అమ్ముడుపోక మిగిలిపోవటం జరుగుతుంది.

# 4. పెట్టుబడిదారీ ప్రపంచ మార్కెట్టు స్థితిగతులు

పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల సంక్షోభదశలో మార్కెటు సమస్య తీవ్రతరమవుతుందని పైన పేర్కొన్నాం. పెరిగిన ఉత్పత్తి ప్రమాణానికి తగినట్లుగా ప్రపంచ వాణిజ్యం పెరగక పోవటం పై నుదహరించినదానికి తార్కాణంగా తీసుకోవచ్చు. పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభం ప్రారంభంకాక పూర్వం, ప్రపంచ పారిశ్రామిక రంగంలోని ఉత్పత్తి పెరుగుదలకు అనుగుణంగానే ప్రపంచ వాణిజ్యంకూడా అభివృద్ధిచెందుతూ వచ్చింది. కాని జనరల్ సంక్షోభదశ ప్రారంభమైన తర్వాత మాత్రం, ఉత్పత్తి పెరుగుదలతోపాటు, దానికి తగినప్రమాణంలో పెట్టుబడిదారీ ప్రపంచ వాణిజ్యం

అభివృద్ధి చెందటం లేదు. పెట్టుబడిదారీ విధానంయొక్క జనరల్ సంక్షోభ ప్రారంభదశలోనే యీ తేడా స్పష్టంగా కన్పించ సాగింది; రెండో ప్రపంచ యుద్ధానంతరం అది మరింత స్పష్టంగా, కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది.

మొదటి పదహారు సంవత్సరాలలోను, మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైనది మొదలు (1913 సంవత్సరంతో 1929 సంవత్సరాన్ని పోల్చి చూచినప్పుడు) పెట్టుబడిదారీ ప్రపంచంలో పారిశ్రామికోత్పత్తి నూటికి 46.6 వంతులు పెరిగితే, ప్రపంచ వాణిజ్యం (స్థిరధరలలో) నూటికి 30.1 వంతులు మాత్రమే పెరిగింది. తర్వాత 16 సంవత్సరాలలోను, రెండవ ప్రపంచ యుద్ధకాలంతో కలుపుకొని (1937 సంవత్సరంతో 1953 వ సంవత్సరాన్ని పోల్చి చూసినప్పుడు) పెట్టుబడిదారీ దేశాల పారిశ్రామికోత్పత్తి 77.9% పెరగగా, మొత్తం ఎగుమతుల పరిమాణం 44.4% మాత్రమే పెరిగింది. పారిశ్రామికోత్పత్తి పెరుగుదలకు తగినట్టుగా, విదేశ వాణిజ్యం పెరగనందువల్ల, పెట్టుబడిదారీ ప్రపంచ మార్కెట్టు తీవ్రమైన పోటాపోటీలకు దారితీసింది.

వివిధ పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక, రాజకీయాభివృద్ధులలో గల ఎగుడుదిగుడులను, రెండవ ప్రపంచ యుద్ధంవచ్చి మరింత ఎక్కువ చేసింది. కొన్ని దేశాలలో దీర్ఘకాలంపాటు సైనిక చర్యలు జరగటం, యుద్ధభీభత్సం కారణంగా ఆ దేశాల ఆర్థిక స్థితిగతులు దుస్థితిలో పడిపోయాయి. ముఖ్యంగా జర్మనీ, ఇటలీ, జపానులకు ఇది వర్తిస్తుంది. ఫ్రాన్సు, బెల్జియం, హాలెండ్, యితర పశ్చిమ యూరపియన్ దేశాలుకూడా

ఘోరమైన నష్టాలు పొందాయి. బ్రిటనుకూడా కొంతవరకు బాగానే దెబ్బతింది. ఇంతకీ ఒక్క అమెరికామాత్రమే ఆయుద్ధం నుంచి, ఆర్థికంగాను, సైనికంగాను కూడా మరింతబలపడి, బయటపడగల్గింది. రెండో ప్రపంచ యుద్ధ భీభత్సం వీసమెత్తు కూడా అనుభవించకుండా అమెరికా ఖండం బయటపడినందు వల్ల, అమెరికా గుత్తాధిపత్యసంస్థలకు మహదవకాశం లభించింది; యుద్ధంవల్ల దెబ్బతిన్న దేశాలలో అమెరికన్ సరుకులకు కావలసినంత మార్కెట్టు దొరికింది. దానితో అమెరికా పారిశ్రామికోత్పత్తి అమాంతంగా పెరిగిపోయింది. 1943 వ సంవత్సరంలో అమెరికా పారిశ్రామికోత్పత్తి, 1939 నాటికన్న రెండున్నర రెట్లు పెరిగింది. అదే సంవత్సరంలో మిగతా పెట్టుబడిదారీ దేశాలలో ఉత్పత్తి తగ్గుముఖం పట్టటం మనకు కన్పించింది. దీని ఫలితంగా, పెట్టుబడిదారీ ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో అమెరికాపాలు, 1937 సంవత్సరంలో నూటికి 45 వంతులుంటే, 1948 లో నూటికి 58 వంతులకు పెరిగింది. అమెరికా ఉత్పాదకశక్తిని ఇతోధికం చేయటానికికూడా యుద్ధం దోహదంమిచ్చింది. యుద్ధ కాలంలో అమెరికాలో వస్తూత్పత్తి పరిశ్రమలలో 2579 కోట్ల 20 లక్షల డాలర్ల పెట్టుబడి పెట్టబడింది. 1945 వచ్చేసరికి, అమెరికా యుద్ధోత్పత్తిశాఖవారి అంచనాలప్రకారం, అమెరికా పరిశ్రమల ఉత్పాదకశక్తి, 1939 తో పోల్చినప్పుడు, నూటికి 40 వంతులకు తక్కువగాకుండా పెరిగినట్లు తేలుతోంది.

దీనంతటివల్ల, పెట్టుబడిదారీ ప్రపంచంలో తోటిదేశాలు బలహీనపడిన సమయంలో అమెరికా బలపడి, మిగతా పెట్టుబడిదారీదేశాలపై పైచేయి సంపాదించుకొన్నది. చే

జిక్కిన ఈ మహదవకాశాన్ని ఉపయోగించుకొంటూ, యుద్ధానంతరం ప్రపంచమంతటా తమ ప్రాబల్యాన్ని అమెరికన్ సామ్రాజ్యవాదులు పెద్దఎత్తున విస్తరించుకొన్నారు. జీవితోపయోగవస్తువుల మార్కెట్లు ఆకట్టుకోటం, విదేశాలలోకి పెట్టుబడులు ఎగుమతిచేయటం, సైనికావసరాలకు సంబంధించిన ముడిసరుకులపై గుత్తాధిపత్యం సంపాదించటం, సైనికవ్యూహం రీత్యా కీలకమైన ప్రాంతాలను హస్తగతంచేసుకోటం – వీటన్నిటి ద్వారా ప్రపంచాధిపత్యం చేజిక్కించుకోటానికి అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్లానుప్రకారం ముందుకు పోతున్నారు. యుద్ధంమూలాన విదేశ మార్కెట్లపై అమెరికా సంపాదించిన ఆధిపత్యం ఈ క్రింది అంకెలనుబట్టి మన గ్రహించవచ్చు: 1938 సంవత్సరంలో అమెరికానుంచి ఎగుమతి అయిన వస్తువుల మొత్తం విలువకు, 4.6 రెట్లు ఎక్కువ గలిగిన సరుకులు 1944 లో ఎగుమతి అయ్యాయి. పెట్టుబడిదారీదేశాల ఎగుమతుల మొత్తంలో 1939 లో అమెరికావాటా నూటికి 13.5 వంతులుంటే, 1944 లో అది నూటికి 45.2 వంతులకు పెరిగింది.

యుద్ధసమయంలో పెట్టుబడిదారీ ప్రపంచమార్కెట్టులో కీలకస్థానాన్ని అమెరికా అవలీలగానే సంపాదించుకోగల్గింది. కాని, యుద్ధానంతరం, యుద్ధంవల్ల ఆర్థికంగా దెబ్బతిన్న దేశాలు తిరిగి శాస్త్ర పుంజుకోటం మొదలెట్టిన దగ్గరనుంచీ, ప్రపంచ మార్కెట్టులోని పరిస్థితి మరింత క్లిష్టతరం కాజొచ్చింది. అందుకు తార్కాణంగా ఈ క్రిందిపట్టిక చూడండి.

## యుద్ధానంతర దశలో మొత్తం పెట్టుబడిదారీ దేశాల ఎగుమతుల్లో వివిధదేశాల వాటాలు

(శాతంలో)

| దేశం | 1938 | 1945 | 1946 | 1947 | 1948 | 1949 | 1950 | 1951 | 1952 | 1953 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అమెరికా | 18.45 | 40.08 | 29.99 | 32.49 | 23.98 | 22.72 | 18.24 | 19.73 | 20.73 | 21.25 |
| బ్రిటను | 10.13 | 7.41 | 11.64 | 9.82 | 12.20 | 12.58 | 10.93 | 9.58 | 9.97 | 9.82 |
| జర్మనీ (1945 నుంచి పశ్చిమజర్మనీ) | 9.96 | 0.08 | 0.72 | 0.71 | 1.35 | 2.15 | 3.56 | 4.46 | 5.57 | 6.00 |
| ఫ్రాన్సు | 3.86 | 0.94 | 2.69 | 3.83 | 3.93 | 5.15 | 5.54 | 5.54 | 5.37 | 5.13 |
| బెల్జియం | 3.20 | 0.38 | 2.15 | 3.02 | 3.28 | 3.34 | 2.98 | 3.52 | 3.38 | 3.00 |
| నెదర్లెండ్సు | 2.50 | — | 0.93 | 1.50 | 1.92 | 2.46 | 2.54 | 2.58 | 2.91 | 2.86 |
| ఇటలీ | 2.41 | — | 0.91 | 1.43 | 2.04 | 2.11 | 2.16 | 2.18 | 1.91 | 2.00 |
| జపాను | 3.83 | — | 0.33 | 0 37 | 0.49 | 0.97 | 1.47 | 1.80 | 1.76 | 1.73 |

పై పట్టికను పరిశీలిస్తే మనకు ఒక విషయం బోధపడు తుంది; యుద్ధానంతరం మొదటి కొద్ది సంవత్సరాలలోను పశ్చిమయూరపు - బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియం, నెదర్లెండ్సు - విదేశమార్కెట్లలో తాము కోల్పోయిన స్థానాన్ని తిరిగి అమెరికానుంచి గుంజుకోసాగాయి. యుద్ధం ముగిసినతర్వాత కొన్ని సంవత్సరాలపాటు యుద్ధంలో పరాభూతమైన జర్మనీ, ఇటలీ, జపాను దేశాల ఎగుమతులు దాదాపు పూజ్యమే నను కోవాలి. వాటి స్థానాలను అమెరికా ఆక్రమించింది. అలాంటి దేశాలుకూడా, కాస్త ఆర్థికంగా తిరిగి పుంజుకోగానే, ఎగు మతుల విషయంలో అమెరికాతో పేంజులాట ప్రారంభిం చాయి; తమ ఎగుమతులను తిరిగి త్వరత్వరగా పెంచుకో సాగాయి. తత్పర్యవసానంగా, యుద్ధకాలంలో విదేశ ఎగు మతులపై అమెరికా సంపాదించుకొన్న ఆధిపత్యాన్ని నిలుపు కోలేకపోయింది. 1944 లో అమెరికా దేశ ఎగుమతులమొత్తం విలువ 1416 కోట్ల 20 లక్షల డాలర్లు ఉంటే, 1950 లో 1014 కోట్ల, 42 లక్షల డాలర్లకు తగ్గిపోయింది. పెట్టుబడిదారీ దేశాలన్నింటి విదేశవాణిజ్య మంతటిలో, ఆయేడు అమెరికా వాటా నూటికి 18.24 వంతులుమాత్రమే ఉంది (1945 లో అమెరికావాటా 40.08%)

విదేశమార్కెట్లలో తమ స్థానాన్ని పదిలం చేసుకో టానికి, తమప్రాబల్యాన్ని యింకా విస్తరించుకోటానికి అమెరికా గుత్తాధిపత్య సంస్థలు, తమచేతిలో కీలుబొమ్మగావున్న అమె రికా ప్రభుత్వయంత్రాంగాన్ని వినియోగించుకొనటంద్వారా, పోటీదార్లను సర్వనాశనం చేయటానికి పూనుకొన్నాయి;

పోటీదార్లను లొంగదీసుకోటానికి ప్రయత్నిస్తున్నాయి. ఇతర దేశాలను తమ బానిస శృంఖలాలమధ్య బంధించి, ఆ దేశాల ఆర్థిక వ్యవస్థలను అమెరికా ఆర్థికవ్యవస్థ ప్రయోజనాలకు అనుగుణంగా మార్చ జూస్తున్నాయి. 'మార్షల్ ప్రణాళిక', అమెరికా ప్రభుత్వ సహాయంతో జరుపబడుతున్న విదేశ వాణిజ్యం, తనపై ఆధారపడిన దేశాలనుంచి అమెరికా ఎలాంటి వస్తువులు దిగుమతి చేసుకోకుండా, తన వస్తువులనే ఆ దేశం నెత్తిన రుద్దుతూ ఎగుమతిచేయటం, (అందువల్ల ఆ దేశాలలో డాలర్లకొరత ఏర్పడడం ఒక దీర్ఘవ్యాధిలాగా తయారుకావటం) ఆర్థికంగా వెనకబడిన దేశాల విదేశ వాణిజ్యం, పరిశ్రమల జీవనాడులు నొక్కివేయటం, సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్‌లతో పెట్టుబడిదారీదేశాలు వాణిజ్యం సాగించరాదని నిషేధించటం - ఇవన్నీకూడా అమెరికా చేస్తున్న ఆ ప్రయత్నంలో అంతర్భాగాలే. సోవియట్ యూనియన్, చైనా ప్రజా రిపబ్లిక్‌లతో పెట్టుబడిదారీ దేశాలు వాణిజ్యం చేయరాదని నిషేధించటంద్వారా, అమెరికా ఒకే దెబ్బతో రెండుపిట్టలను చావకొట్టాలని ఆశిస్తోంది. ఒకటి: నూతన ప్రపంచ మార్కెట్టు నవనాడులను బంధించటానికి, రెండు: ఇతర పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక జీవనాన్ని తన గుప్పెట్లోకి తీసుకోటానికి పై చర్యను సాధనంగా వినియోగించ జూస్తోంది.

ఒకప్రక్క, తమను ఎదుర్కొన్న ఆర్థికసంబంధమైన యిక్కట్టులనుంచి బయటపడటానికి; ప్రజల కొనుగోలుశక్తి పడిపోవటంవలన ఏర్పడిన పరిశ్రమ మాంతపడే ప్రమాదంనుంచి

తప్పించుకోటానికి, ఆయుధధారణ కార్యక్రమం పెంచుతూనే, అమెరికన్ సామ్రాజ్యవాదులు మరొకప్రక్క మరొక ప్రపంచ యుద్ధానికి తెగించి మరీ సన్నద్ధమవుతున్నారు; సైనిక బలగాన్ని విపరీతంగా పెంచేస్తున్నారు. మొత్తం ఆర్థికవ్యవస్థనంతనీ సైనికాత్మకం చేస్తున్నారు. అందుకనే గత యుద్ధం ముగిసినప్పటి నుంచీ అమెరికాలో సైనికతత్వం విచ్చలవిడిగా పెరిగిపోవటం మనం చూస్తాం. యుద్ధావసరాలకోసం అమెరికా బడ్జెట్‌లో ఖర్చుపెట్టే మొత్తాలు అందుకు తిరుగులేని తార్కాణం అనవచ్చు. రెండో ప్రపంచయుద్ధ ప్రారంభానికి ముందు సంవత్సరంలో అంటే 1938-39 సంవత్సరంలో అమెరికా సైనిక వ్యయం 107 కోట్ల 40 లక్షల డాలర్లు; అంటే మొత్తం బడ్జెట్‌లో అది నూటికి 11.9 వంతులుమాత్రమే. రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తదనంతరం కొద్ది సంవత్సరాలవరకు అమెరికా ఏటేటా 1000 కోట్లనుంచి 1200 కోట్ల డాలర్లవరకు సైనికావసరాలకు ఖర్చుపెట్టుతూ వచ్చింది. అంటే మొత్తం బడ్జెట్‌లో అది యించుమించు నూటికి 30 వంతు లన్నమాట. కాని, 'వాములుమింగే స్వాములవారికి పచ్చగడ్డి ఫలహారమా?' అన్నట్లు ఆ మొత్తంకూడా అమెరికా గుత్తాధిపత్య సంస్థలకు చాలలేదు. ఆయుధాలకోసం ప్రభుత్వం యిచ్చే ఆర్డర్లు మంచి వాటంగావుండి, అపారమైన లాభాలు తీయటానికి ఆ సంస్థలకు వీలుచిక్కుతోంది మరి. అందువల్ల బడ్జెట్‌లో సైనికవ్యయం అదేపనిగా పెంచుకొంటూ పోసాగారు. 1952-53 సంవత్సరం వచ్చేసరికి, సైనికవ్యయం 4446 కోట్ల 60 లక్షల డాలర్లకు పెరిగిపోయింది.

అంటే మొత్తం బడ్జెట్‌లో అది దాదాపు నూటికి 60 వంతులు. శాంతి సమయంలో యింత పెద్ద మొత్తం, బడ్జెట్టులో మూడింట రెండువంతులు ప్రత్యక్షంగా సైనికావసరాలకోసం ఖర్చుచేయటం, పెట్టుబడిదారీ దేశాల చరిత్ర మొత్తంలోనే ఎక్కడా మనకు కన్పించదు. 'వ్యాపార సరళి'లో స్థిరత్వం సాధించటంకోసమని ప్రస్తుతం అమెరికా ప్రభుత్వం వస్తువుల, ఉద్యోగాలపై ఖర్చుపెట్టుతున్న మొత్తం పరిశీలిస్తే, దానిని గురించి అమెరికా బూర్జువావేత్తలు చెప్పుతున్న కబుర్లలోని మోసం బయటపడుతుంది. 1929 లో 'వ్యాపార సరళి'లో స్థిరత్వం సాధించటంకోసం అమెరికా ప్రభుత్వం పెట్టిన మొత్తంఖర్చు 848 కోట్ల 20 లక్షల డాలర్లు; అంటే మొత్తం జాతీయాదాయంలో అది నూటికి 9.6 పాళ్లుమాత్రమే కాగా, అందుకోసమే 1953 లో అమెరికా ప్రభుత్వం ఖర్చు పెట్టిన మొత్తం 8,523 కోట్ల 50 లక్షల డాలర్లు; అంటే మొత్తం జాతీయాదాయంలో అది 27.2%. యుద్ధాత్మక బడ్జెట్ సైనికాత్మక ఆర్థిక వ్యవస్థలే తమకు శ్రీరామరక్షయనీ పరిష్కారాతీతంగావున్న వైరుధ్యాల బారినుంచి బయట పడడానికి అదే ఏకైక తరణోపాయమనీ అమెరికన్ సామ్రాజ్యవాదులు భావిస్తున్నారు. అమెరికన్ సామ్రాజ్యవాదుల సైనికకూటములను నిర్మించి, వాటికి సారధ్యం వహిస్తూ, యితర పెట్టుబడిదారీ దేశాలలో యుద్ధోన్మాదం రెచ్చగొట్టుతున్నారు దీనిద్వారా యితర దేశాల ప్రాంతాలను వారు ఆక్రమించుకో గల్గుతున్నారు. తమ దేశంలో తయారైన ఆయుధాలతో విదేశాలను ముంచెత్తుతున్నారు.

ఈ చర్యలద్వారా అనేక పశ్చిమరాజ్యాల విదేశ వాణిజ్యాభివృద్ధినీ, ఆర్థికాభివృద్ధినీ అమెరికా అరికట్టగల్గింది. ఇతర పెట్టుబడిదారీ దేశాలకు బ్రిటను, ఫ్రాన్సులు చేస్తున్న ఎగుమతులను పడగొట్టటంలో అమెరికా గత రెండు మూడు సంవత్సరాలలోను జయప్రదమైంది. అదే సమయంలో, యింతకుముందు బ్రిటిష్ పెట్టుబడులు రాజ్యమేలుతున్న ప్రాంతాలనుంచి, చివరకు బ్రిటిషు సామ్రాజ్యప్రాంతాలనుంచి కూడా బ్రిటనును సాగనంపి, ఆ ప్రాంతాలలో అమెరికన్ సామ్రాజ్యవాదులు తిష్టవేస్తున్నారు. అమెరికానుంచి విదేశాలకు ఎగుమతి అవుతున్న పెట్టుబడుల పరిమాణంకూడా యుద్ధానంతరం బాగా పెరిగింది. ఉదాహరణకు : 1938 లో ఎగుమతి అయిన పెట్టుబడులకు, 1953 లో మూడురెట్లు అధికంగా, అంటే 3,500 కోట్ల డాలర్లు, అమెరికానుంచి ఎగుమతి అయ్యాయి. అదే సమయంలో బ్రిటిషు పెట్టుబడుల ఎగుమతులు పడిపోయాయి. 1938 తో పోల్చితే 1951 లో బ్రిటను విదేశపెట్టుబడులు నూటికి 44 వంతులు తగ్గిపోయాయి.

అంతేకాక, ఆర్థికంగా వెనకబడిన దేశాలు వాణిజ్య గొంతును అమెరికన్ గుత్తాధిపతులు నులిమివేస్తున్నారు. అర్జంటీనా, బ్రెజీల్ మెక్సికో, ఈజిప్ట్, ఇండియా, ఇరాన్ తదితర దేశాల ఎగుమతుల పరిమాణం అమెరికా పోటీమూలాన, అలాగే అమెరికన్ సామ్రాజ్యవాదులు విధించిన అనేక పరిమితుల కారణంగాను 1947 నుంచి పడిపో సాగింది. ఉదాహరణకు, 1946 లో పెట్టుబడిదారీ దేశాల మొత్తం ఎగుమతులలో ఇండియావాటా 3.03% వుంటే,

1953 లో అది 1.49% కు పడిపోయింది; అలాగే ఇరాన్ వాటా 0.91% నుంచి 0.17% పడిపోయింది. మెక్సికో వాటా 1.27% నుంచి, 0.72% కు, ఈజిప్ట్ వాటా 0.90% నుంచి 0.53% కు, ఆర్జంటీనా వాటా 3.69% నుంచి 0.92% (1952 లో) పడిపోయాయి. ఆర్థికంగా వెనకబడిన దేశాలపై అమెరికా తెచ్చిన విపరీతమైన వత్తిడిమూలాన ఆ దేశాల ఎగుమతులు ఎంతగా పడిపోయాయో ఈ క్రింది పట్టిక తెల్పుతుంది.

## ఆర్థికంగా వెనకబడిన అనేక దేశాల
## భౌతిక పరిమాణం 1937—100

| దేశం | 1948 | 1949 | 1950 | 1951 | 1952 | 1953 |
|---|---|---|---|---|---|---|
| పెట్టుబడిదారీ ప్రపంచం | 101.0 | 109.0 | 123.2 | 137.3 | 135.3 | 144.4 |
| చిలీ | 95.2 | 88.5 | 83.8 | 78.1 | 73.3 | 55.2 |
| బ్రెజిల్ | 126.5 | 116.4 | 98.7 | 103.8 | 83.5 | 93.8 |
| ఇండియా | 57.1 | 62.8 | 70.2 | 56.0 | 62.5 | 62.8 |
| బర్మా | 37.7 | 35.1 | 26.7 | 27.9 | 38.9 | 29.9 |

ప్రస్తుతం ఆర్థికంగా వెనకబడివున్న అనేక దేశాల ఎగుమతులు భౌతిక ప్రమాణస్థాయి యుద్ధాత్పూర్వపుస్థాయికన్నా ఎంతో కొంత తక్కువగా వుంది, అదే సమయంలో మొత్తం పెట్టుబడిదారీ ప్రపంచంయొక్క ఎగుమతుల భౌతికపరిమాణం విపరీతంగా పెరిగిందన్న విషయం ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. 1953 లో పెట్టుబడిదారీ ప్రపంచం ఎగుమతుల భౌతిక పరిమాణం 144.4% కు పెరిగితే, 1937 తో పోల్చితే 1953 లో

అమెరికా ఎగుమతుల భౌతిక ప్రమాణం పెరుగుదల 244%, ఫ్రాన్సు వాటా 184.7%, పశ్చిమ జర్మనీ వాటా 155.1%, యుద్ధానంతరం పెట్టుబడిదారీ ప్రపంచమార్కెట్టు పోటీ మూలంగా నష్టపడినదెవరో, లాభం పొందినదెవరో స్పష్టం చేస్తున్నాయి.

## 5. తీవ్రతరమవుతున్న పెట్టుబడిదారీ వైరుధ్యాలు

పెట్టుబడిదారీ అగ్రరాజ్యాల మధ్యగల వైరుధ్యాలు తీవ్రరూపం ధరిస్తున్నాయి. ఒకప్రక్క అమెరికన్ సామ్రాజ్యవాదం ఇతరదేశాలను తనచేతిలో కీలుబొమ్మలుగా మార్చి, వాటి సర్వతంత్ర స్వతంత్ర ప్రతిపత్తి హరిస్తుంటే, పెట్టుబడిదారీ ప్రపంచంలో అమెరికా సామరస్యం నెలకొల్పుతున్నదనీ, ఇతర పెట్టుబడిదారీ దేశాలతో, ఎలాంటి కీచులాటకు, వైరుధ్యానికి తావీయకుండా, శాంతియుతమైన, సామరస్యపూర్వకమైన సంబంధాలను పెంపొందించుకొంటున్నదనీ నమ్మించటానికి అమెరికన్ సామ్రాజ్యవాద తత్వవేత్తలు నానాతంటాలు పడుతున్నారు.

ఈ ఊహాజనిత సామ్రాజ్యవాద సిద్ధాంతం (అల్ట్రా ఇంపీరియలిజం) కాస్మాపొలిటన్ భావాలకు అనుగుణంగా ఉంటేఉండవచ్చు కాని, యథార్థ పరిస్థితులకుమాత్రం అది అనుగుణంగా లేదు.

ఏది ఏమైనప్పటికీ, మార్కెట్లలో ఇతరదేశాల స్థానాన్ని అమెరికా ఆక్రమించుకుంటూ, వాటి సర్వతంత్ర

స్వతంత్ర ప్రతిపత్తిని హరించుతున్న కాలం, 'ఐక్యత', 'కమ్యూనిస్టు ప్రమాదం' వంటి ముసుగులో దానిని దాచిపెట్టినప్పటికీ, అమెరికాకు, ఇతర పెట్టుబడిదారీ దేశాలకుమధ్య వైరుధ్యాలు తీవ్రతరంకాక మానవు.

అమెరికా ఆజ్ఞానుసారం నిర్మించబడిన అనేకానేక సైనిక కూటములలోనే తీవ్రసంఘర్షణలు చెలరేగుతున్నాయి. పోటీదారులమధ్య ఐక్యత గురించి పరిశీలించేటప్పుడు, వారి మధ్యవుండే ఐక్యతకన్నా, వారిమధ్యవుండే పోటీయే బలంగావుంటుంది. పెట్టుబడిదారీ అర్థనీతి సూత్రాల ఫలితంగానే, ప్రత్యేకంగా పెట్టుబడిదారీదేశాల అసమమైన రాజకీయ ఆర్థికాభివృద్ధి సూత్రాలఫలితంగానే బలాబలాలలో వచ్చే మార్పులనుబట్టి, (పెట్టుబడిదారీదేశాలమధ్య తీవ్రత, అంతర్జాతీయ రంగంలో దాని ఫలితాలు వుంటాయికాని, ఎవరో కోరుకున్నందువల్ల అవిరావు) రెండో ప్రపంచయుద్ధంవల్ల, పెట్టుబడిదారీప్రపంచంలో అమెరికా బలపడి అగ్రాధిపత్యం సంపాదించగా, బ్రిటనుతోసహా యితర పెట్టుబడిదారీదేశాలన్నీ బలహీన పడిపోయాయి. యుద్ధంముగిసి దాదాపు తొమ్మిదేళ్లు పైబడింది. ఈ మధ్యకాలంలో పెట్టుబడిదారీ దేశాల బలాబలాలలో కొత్తమార్పులురావటం మనం చూస్తున్నాం.

బ్రిటను అమెరికాపై ఆధారపడి బ్రతుకుతున్నప్పటికీ, అట్లాంటిక్ సముద్రం ఆవలి గుత్తాధిపత్య సంస్థలతో పోటాపోటీలో దెబ్బతిన్నప్పటికీ, బ్రిటను తన పారిశ్రామికోత్పత్తిని పెంచుకొని, మార్కెట్లకోసం, పెట్టుబడులు ఎగుమతిచేయటం కోసం ఘోరాహోరీ పోరాటం సాగిస్తోంది. 1948 నాటికే

బ్రిటిషు పారిశ్రామికోత్పత్తి 1938 స్థాయికన్నా నూటికి పది వంతులు మించిపోయింది; 1950 నాటికి 25%, 1953 నాటికి 53% పెంచుకొంది. బ్రిటిషు ఎగుమతులు విలువ రీత్యా, క్రమేణా పెరిగిపోతున్నాయి. బ్రిటిష్ విదేశ పెట్టుబడులు పడిపోవటం ఆగిపోయింది. బ్రిటను, అమెరికాలమధ్య తీవ్రతర మవుతున్న వైరుధ్యాలు, ముడి సరుకులకోసం, మార్కెట్ల కోసం, పెట్టుబడులుపెట్టటానికి అనువైన ప్రాంతాలకోసం ఆ రెండు దేశాల మధ్య ప్రత్యక్ష పోరాటంగా పరిణామం చెందుతాయి.

ఫ్రాన్సు, అమెరికాలమధ్య సంబంధాలు విషమించ సాగాయి. అమెరికన్‌పోటీ వున్నప్పటికీ, ఫ్రెంచి పారిశ్రామి కోత్పత్తి నెమ్మదిగానే అయినా పెరుగుతోంది. 1948 నాటికి ఫ్రాన్సు పారిశ్రామికోత్పత్తి 1937 నాటికన్నా నూటికి 2 వంతులు, 1950 నాటికి నూటికి 13 వంతులు, 1951 నాటికి నూటికి 30 వంతులు పెరిగింది. 1951 వ సంవ త్సరం వరకు ఫ్రాన్సులోని ఎగుమతులను క్రమేణా పెంచు కుంటూనే వచ్చింది. ప్రస్తుత ధరవరులబట్టి ఫ్రెంచి ఎగుమతుల విలువను అంచనావేస్తే, 1938 నాటికన్నా 1953 లో నాలుగు న్నరరెట్లు పెరిగాయి. స్థిరధరలప్రకారం అంచనాకట్టితే నూటికి 55 వంతులు పెరిగాయి. పెట్టుబడిదారీ దేశాల ఎగుమతుల మొత్తంలో ఫ్రాన్స్‌వాటా 1938లో నూటికి 3.86 వంతులుంటే, 1953 లో నూటికి 5.13 వంతులకు పెరిగింది. ఫ్రెంచి వలస ప్రాంతాలతోసహా అనేక మార్కెట్లలో పెట్టుబడులవిషయంలో కూడా అమెరికా పోటీని ఫ్రాన్స్ ఎదుర్కోవలసివస్తోంది.

యుద్ధానికిపూర్వం ఫ్రెంచి వలస ప్రాంతాల దిగుమతులలో నూటికి 59 వంతులు ఫ్రాన్సునుంచి వచ్చేవి; అప్పుడు ఆ ప్రాంతాల దిగుమతులలో అమెరికా వాటా నూటికి 4.9 వంతులు మాత్రమే ఉండేది. కాని, యుద్ధకాలంలో ఆ పరిస్థితి పూర్తిగా తారుమారైంది. 1945 వచ్చేసరికి 59% గా ఉన్న ఫ్రాన్సు వాటా 19.4% కు పడిపోగా, అమెరికా వాటా 4.9% నుంచి 34.9% కు పెరిగింది. యుద్ధానంతరం ఫ్రెంచి వలస ప్రాంతాలలో ఫ్రెంచి పెట్టుబడులకు, అమెరికా పెట్టుబడులకు మధ్య హోరాహోరీ పోరాటం ప్రారంభమైంది. దాని ఫలితంగా 1952 వచ్చేసరికి ఫ్రెంచి వలసప్రాంతాల దిగుమతుల్లలో ఫ్రాన్సు వాటా 70.2% పెరగటం, అమెరికా వాటా 6.2% కు పడిపోవటం, అంటే యించుమించు యుద్ధాత్పూర్వపుస్థాయికి పడిపోవటం సంభవించింది.

అదే సమయంలో, యుద్ధంలో పరాభూతం చెందిన జర్మనీ, జపాను, ఇటలీ దేశాలు తిరిగి ఆర్థికంగా పుంజుకొని, తమ పారిశ్రామిక శక్తి స్తోమతులను పునరుద్ధరించుకొని గట్టి పోటీదారులుగా విదేశ మార్కెట్లలో ప్రత్యక్ష మయ్యాయి. యుద్ధానంతరం బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా దేశాలలోకన్నా ఈ దేశాలలో పారిశ్రామికాభివృద్ధి చాలా వేగంగా సాగిపోతోంది.

యుద్ధానంతరదశలో పారిశ్రామికోత్పత్తి పెరుగుదలస్థాయి.

(1948 = 100)

| దేశం | 1949 | 1950 | 1951 | 1952 | 1953 | 1954 మొదటి 8 నెలలలో |
|---|---|---|---|---|---|---|
| అమెరికా | 93 | 108 | 115 | 119 | 129 | 118 |
| బ్రిటన్ | 106 | 114 | 117 | 114 | 121 | 125 |
| ఫ్రాన్స్ | 110 | 111 | 125 | 131 | 127 | 135 |
| ఇటలీ | 110 | 127 | 144 | 147 | 161 | 173 |
| జపాను | 129 | 142 | 193 | 213 | 257 | 273 |
| జర్మనీ | 144 | 180 | 216 | 231 | 251 | 271 |

ఆవిధంగా మూడు ప్రధాన పెట్టుబడిదారీదేశాల పారిశ్రామికోత్పత్తి పెరుగుదల స్థాయిలకు, రెండో ప్రపంచయుద్ధంలో పరాభూతమైన మూడుదేశాల పారిశ్రామికోత్పత్తి స్థాయిలకు మధ్య వ్యత్యాసం మనకు స్పష్టంగా కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది. తత్పర్యవసానంగా 1953 వచ్చేసరికి, జపాను పారిశ్రామికోత్పత్తి, 1937 నాటి ఉత్పత్తితో పోల్చి చూసినప్పుడు, 23.5% పెరిగింది. అలాగే ఇటలీ పారిశ్రామికోత్పత్తిలో 57.8%, పశ్చిమ జర్మనీ పారిశ్రామికోత్పత్తిలో 57.8% (1936 నాటితో పోల్చి నప్పుడు) పెరుగుదల కన్పిస్తోంది.

పశ్చిమ జర్మనీ, జపాను, ఇటలీదేశాల పారిశ్రామికోత్పత్తి చాలా త్వరత్వరగా పెరుగుతున్నది కాబట్టే, ఆదేశాలు విదేశమార్కెట్లకోసం తాపత్రయపడసాగాయి. ఇప్పటి కప్పుడే బ్రిటన్, అమెరికా మార్కెట్లతోసహా కొన్ని దేశాల

మార్కెట్లను అవి ఆకట్టుకొంటున్నాయి. పశ్చిమ జర్మనీ ఎగుమతులు ఏటేటా విపరీతంగా పెరిగిపోతున్నాయి. 439 కోట్ల 35 లక్షల డాలర్ల విలువచేసే ఎగుమతులను 1953 లో పశ్చిమ జర్మనీచేసింది; ఆవిధంగా ప్రపంచంలోకల్లా ఎక్కువ ఎగుమతులు చేసిన దేశాలలో అది మూడవస్థానం ఆక్రమించింది. మూండవస్థానంలో వుంటూవచ్చిన ఫ్రాన్స్ నాలగవ స్థానానికి నెట్టివేయబడింది. ముఖ్యంగా ఆఫ్రికా, లాటిన్ అమెరికా, సమీప, మధ్యప్రాచ్యాలలో జర్మన్ గుత్తాధిపత్య సంస్థల వ్యవహారం మూడుపూలు ఆరు కాయలుగా ఉంది. ఆప్రాంతాలలో బ్రిటిష్, అమెరికన్ ఎగుమతిదార్లనుంచి జర్మన్లు కీలక స్థానాలను యిప్పటికే గుంజుకోగల్గారు. దక్షిణాఫ్రికాకు పశ్చిమ జర్మనీ 1952 లో చేసిన ఎగుమతులకన్నా 1953 లోని ఎగుమతులు నూటికి 53 వంతులు పెరిగాయి; అలాగే ఇరాక్ కు చేసిన ఎగుమతులలో 71%, ఇండియాకు చేసిన ఎగుమతులలో 42%, ఈజిప్టు, సాదీ అరేబియా, యెమెన్, ఇస్రేల్, లిబియా, సిరియా, ఇరాన్ యిత్యాది దేశాలకు చేసిన ఎగుమతులలో 53% పెరుగుదల కన్పించింది. ఇక లాటిన్ అమెరికాకు అమెరికా తర్వాత, హెచ్చుగా ఎగుమతులు చేస్తున్న దేశం పశ్చిమ జర్మనీయే. ఆ విధంగా లాటిన్ అమెరికా మార్కెట్టులో బ్రిటన్‌ను ద్వితీయ స్థానంనుంచి తోసేసి, ఆస్థానం పశ్చిమ జర్మనీ ఆక్రమించింది.

విదేశమార్కెట్లలో జపానుకూడా ముఖ్యపోటీదారు తయారైంది. 1953 లో దాని ఎగుమతులు 1946 ఎగుమతుల కన్నా 12 రెట్లు ఎక్కువ. ముఖ్యంగా ఇండియా, పాకిస్తాన్,

బర్మా, తాయ్‌లాండ్, ఇండోనేషియా, ఆస్ట్రేలియా, లాటిన్ అమెరికా, మధ్యప్రాచ్యం మున్నగు ప్రాంతాలలో జపాను ఎగుమతిదారుల వ్యవహారం మహాజోరుగా ఉంది. జపాను ఎగుమతులలో ముఖ్యంగా చెప్పుకోదగినవి వస్త్రాలనవచ్చు. ప్రపంచంలో వస్త్రాలు హెచ్చుగా ఎగుమతిచేసే దేశాలలో తృతీయ స్థానాన్ని 1947 లో జపాను ఆక్రమించి వుంటే, ఈనాడు అది ప్రథమస్థానం హస్తగతం చేసుకొని, బ్రిటనును రెండో స్థానానికి, అమెరికాను మూడో స్థానానికి నెట్టేసింది. బ్రిటిషు వస్త్ర పరిశ్రమకు జపానుపోటీ ప్రమాదకరంగా పరిణమించిందని గోలపెట్టుతూ, 'ఎకనమిస్టు' పత్రిక ఇలా వ్రాసింది: "జపాను పోటీ మూలాన ఈనాడు ఆందోళన చెందుతున్నది ఒక్క లాంక్‌షైర్ (వస్త్ర పరిశ్రమలు) మాత్రమే కాదు. బ్రిటిషు పరిశ్రమలలో, యంత్ర పరికరాలను ఉత్పత్తి చేసే పరిశ్రమే కానీయండి, లేదా ఫౌంటెన్ కలాలు, విద్యుత్ పరికరాలు, సైకిళ్ళు ఉత్పత్తిచేసే పరిశ్రమలే కానీయండి, ఒక దానితర్వాత మరొకటి జపాను పోటీని గురించి ఆందోళనను వ్యక్తంచేయ మొదలెట్టాయి."

ప్రముఖ పారిశ్రామిక దేశాలకు, వలసప్రాంతాలకు మధ్య, అలాగే సామ్రాజ్య దేశాలకు, పరాధీన దేశాలకు మధ్యగల వైరుధ్యాలు తీవ్రతరం కావటం మనకు యుద్ధానంతర దశలో స్పష్టంగా గోచరిస్తోంది. వలసప్రాంతాలపై సామ్రాజ్య దేశాలు తెస్తున్న విపరీతమైన వత్తిడి, ఆ వలసదేశాల పరిశ్రమలు, విదేశ వాణిజ్యాల నవనాడులను బంధించాలని సామ్రాజ్య దేశాలు సాగిస్తున్న ప్రయత్నాలు, శ్రామిక ప్రజా

సామాన్యాన్ని మరింత దారుణంగా దోచుకోటానికి తీసుకుం టున్న చర్యలు—వీటన్నిటిపట్ల వలన, పరాధీనదేశాల ప్రజలలో ప్రాతికూల్యం నానాటికి హెచ్చవుతోంది.

యుద్ధానంతరం ప్రధాన పెట్టుబడిదారీ దేశాలలోని శ్రామికప్రజల వర్గపోరాటాలు మరింత తీవ్రతరమయ్యాయి. కార్మికుల, కష్టజీవుల హక్కులను గుత్తాధిపత్య సంస్థలు హరించటం, వారి జీవనప్రమాణాన్ని దెబ్బతీయటం, ఆర్థిక వ్యవస్థను సైనికాత్మకంగా మార్చటం, పన్నులభారం మరింత పెరగటం, వీటన్నిటికి తోడు జీవనవ్యయప్రమాణం హెచ్చటం, వీటన్నిటినీ పెట్టుబడిదారీ దేశాలల్లోని సాధారణ ప్రజలు గట్టిగా ప్రతిఘటిస్తున్నారు. యుద్ధానంతరం కనీవిని ఎరుగ నంత ఉవ్వెత్తున పెల్లుబికిన సమ్మెపోరాటాల పరంపర ఏదో అర్థంతరంగా వచ్చిపడలేదు. ప్రధానమైన పదహారు పెట్టు బడిదారీ దేశాలలో 1935–39 మధ్యకాలంలో 49,515 సమ్మెలు జరిగాయి; వాటిలో 1,54,29,000 కార్మికులు పాల్గొన్నారు. ఆ దేశాలలోనే 1946–50 మధ్యకాలంలో 57,963 సమ్మెలు జరిగాయి; 4,94,32,000 కార్మికులు వాటిల్లో పాల్గొన్నారు. ప్రముఖ పెట్టుబడిదారీ దేశమైన అమెరికాలో వర్గశాంతి, సామరస్యం విలసిల్లుతున్నవని కొంత మంది బూర్జువా పోసుకోలురాయుళ్లు కోతలు కోస్తుంటారు; కాని అలాంటి అమెరికాలోనే, ఆ దేశచరిత్రలో మునుపెన్నడూ కనీవిని ఎరుగనంత పెద్దఎత్తున సమ్మెపోరాటాలు వచ్చాయి. 1946–52 మధ్యకాలంలో అమెరికాలో ఏటేటా సగటున 4345 సమ్మెలు జరిగాయి. కాని, యుద్ధాత్పూర్వం 1934–38

మధ్యకాలంలో ఏటేటా సగటున 2710 సమ్మెలు మాత్రమే జరిగాయి. యుద్ధాత్పూర్వం జరిగిన ఆ సమ్మెల్లో 11,85,000 కార్మికులు పాల్గొంటే, యుద్ధానంతరం జరిగిన ఆ సమ్మెల్లో 28,46,000 కార్మికులు పాల్గొన్నారు. కార్మికుల జీవన ప్రమాణం పడిపోకుండా నిలబడటానికి, వారి ప్రాథమిక హక్కులు కాపాడబడటానికి యుద్ధానంతర సమ్మెపోరాటాలు ఎంతగానో దోహదమిచ్చాయి.

అమెరికన్ సామ్రాజ్యవాద తాత్వికులు ఉద్ఘాటిస్తున్నట్లు, బడ్జెట్‌లో సైనికవ్యయం విపరీతంగా పెంచినందువల్ల పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థలో వున్న నైరుధ్యాలు సమసిపోక పోగా, అవి మరింత తీవ్రతరమయాయి. నిరుద్యోగుల సంఖ్య పెరిగింది; ప్రజల దారిద్ర్యం హెచ్చింది; ప్రజలలో అసంతృప్తి జ్వాలలు అధికమయ్యాయి; వారి కొనుగోలుశక్తి క్షీణించింది; సమ్మెపోరాటాలసంఖ్యా హెచ్చింది. కొంతమంది బూర్జువా ఆర్థికవేత్తలు ఆశించినట్లు, ఆర్థికవ్యవస్థను సైనికాత్మకంగా మార్చినందువల్ల ఆర్థిక సంక్షోభంనుంచి బయటపడటం సాధ్యంకాదు; ఇంతకుపూర్వ మెప్పుడూ సాధ్యపడనూ లేదని అనుభవం చాటుతోంది. అందువల్ల ఆర్థికసంక్షోభం నుంచి అమెరికా ఆర్థికవ్యవస్థను ఆ పద్ధతిద్వారా కాపాడటం సాధ్యంకాని విషయం. యుద్ధానంతరం అమెరికా పారిశ్రామికోత్పత్తి ఆటుపోటులకు సంబంధించిన వివరాలు పైవిషయాన్నే చక్కగా నిరూపిస్తున్నాయి.

గత యుద్ధకాలంలో ఎలాంటి నష్టం పొందకపోవటమే కాక, ఆ యుద్ధంవల్ల అపారంగా లాభపడిన అమెరికావంటి

దేశంయొక్క ఆర్థికాభివృద్ధి సైతం యుద్ధానంతరం ఏమాత్రం సాఫీగా సాగిపోవటంలేదు. ఇంచుమించు పది సంవత్సరాల కాలంలో అమెరికా పరిశ్రమలు మూడు పర్యాయాలు – 1946 లో ఒకసారి, 1949 లో మరొకసారి, తిరిగి 1953–54 లో యింకొకసారి – తిరోముఖం పట్టవలసివచ్చింది. ఈ పదిసంవత్సరాల కాలంలోను ఒకసారిమాత్రమే – 1953 లో మాత్రమే – అమెరికా పారిశ్రామికోత్పత్తి 1943 స్థాయికి చేసుకోగల్గింది. అప్పుడైనా ఆస్థాయిని అందుకోగల్గిందే కాని, అధిగమించలేక పోయింది. ఇదే సందర్భంలో మరొక ఉదాహరణ తీసుకొందాం. ప్రథమ ప్రపంచయుద్ధకాలంలోకల్లా 1917 లో పారిశ్రామికోత్పత్తి ఉన్నతస్థాయి నందుకొంటే, 1922 వచ్చేసరికి ఆ స్థాయిని అమెరికా అధిగమించగల్గింది. దీనినిబట్టి, యుద్ధానంతర అమెరికాలో అంతూపంతూ లేకుండా పెచ్చు పెరిగిపోయిన సైనికవ్యయంవల్ల, ఆర్థికాభ్యుదయం సాఫీగా సాగకపోగా, వైరుధ్యాలు తీవ్రతరమై, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ మరింత అల్లకల్లోలానికి దోహదమిస్తుందని తేలుతోంది.

"ప్రచ్ఛన్నయుద్ధ"కాలంలో ఆర్థిక వ్యవస్థను సైనికాత్మకం చేయటం, హిట్లర్ పదజాలంలో చెప్పాలంటే, "తుపాకులు పేలకుండా వుండే యుద్ధాత్మక ఆర్థిక వ్యవస్థ"వల్ల కాస్తో కూస్తో ఉత్పత్తి పెరుగుదల సాధ్యమైనా – అదికూడా ఆయుధోత్పత్తే – దానిని అలా ఎంతోకాలం కొనసాగించటం అసాధ్యం కాకమానదు. ఆర్థికవ్యవస్థను సైనికాత్మకం చేసినందువల్ల ఉత్పత్తి అవకాశాలకూ, క్రమంగా కుంచించుకు పోయే ప్రజల కొనుగోలుశక్తికి మధ్య అగాధం పెచ్చుపెరిగి

పోతుంది. హనుమంతుని తోకలా పెరిగిపోయే సైనికవ్యయం నిమిత్తం, పన్నులభారాన్ని పెద్ద ఎత్తున పెంచటం, జీవనవ్యయ ప్రమాణం పెరిగిపోవటం - ఇదంతా సైనికవ్యయం పెరిగి నందువల్ల ఒనకూడే అనర్థకం - తత్పర్యవసానంగా ప్రజల కొనుగోలుశక్తి విపరీతంగా కుంచించుకొని పోతుంది.

బ్రహ్మాండమైన నూతన ఆర్థిక సంక్షోభాలకు అవన్నీ దారితీస్తాయి. సైనిక వ్యయాన్నీ, ఆయుధీకరణ కార్యక్రమాన్నీ విపరీతంగా పెంచుకుంటూపోయే అమెరికన్ గుత్తాధిపత్య పెట్టుబడిదారీపాలకులు, సోవియట్‌యూనియన్, నూతన ప్రజాతంత్రదేశాల పై దెబ్బతీయాలనే ఉద్దేశంతో మరొక ప్రపంచ యుద్ధానికి ఆయత్త మవుతున్నారు. చరిత్రనేర్పిన గుణపాఠాలను విస్మరించటం ఏమంత మంచిదికాదు. ఒకవేళ మూడో ప్రపంచయుద్ధాన్ని ప్రారంభించటంలో అమెరికన్ సామ్రాజ్యవాదులు కృతకృత్యులు కాగలిగినా, అది వాళ్ళకు శ్రేయస్కరం మాత్రం కాబోదు. మొదటి ప్రపంచయుద్ధం వల్ల, రష్యాదేశాన్ని పెట్టుబడిదారీవ్యవస్థ కోల్పోవలసివచ్చింది. రెండో ప్రపంచ యుద్ధంమూలాన, యూరప్‌లోను, ఆసియాలోను అనేక దేశాలను అది కోల్పోవలసి వచ్చింది. ఇక మూడో ప్రపంచయుద్ధం రావటం అంటే, ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ పూర్తిగా కూలిపోవటమే కాగలదు.

ఒక తరంలోనే రెండు ప్రపంచయుద్ధాలబీభత్సాలను అనుభవించిన ప్రపంచప్రజానీకం, మూడో ప్రపంచయుద్ధానికి వ్యతిరేకంగా కార్యరంగంలోకి దుముకుతున్నారు. మరొక ప్రపంచ యుద్ధప్రమాదం రాకుండా నివారించేందుకు, ప్రపంచవ్యాపి

తంగా మహత్తరమైన శాంతి ఉద్యమం ప్రారంభమయి, అ
వృద్ధిచెందుతోంది. వివిధవర్గాల ప్రజలు, విభిన్న రాజకీయా
ప్రాయాలుగలవారు విభిన్నమత విశ్వాసాలు గలవారూ
శాంతి ఉద్యమంలో పాల్గొంటున్నారు. ప్రపంచ వ్యాపితమై
ఆ శాంతి ఉద్యమానికి తలమానికంగా, శాంతిసమర సై
కుడుగా అగ్నిపరీక్షల్లో కాకలుతీరిన సోవియట్ యూనియ
నిలబడివుంది.

